



## సంపాదక వర్గం

సంపాదకుడు:
లయన్ కె వి గోవిందరావు
బి.ఎ ఎల్ ఎల్ బి

గౌరవ సహాయ సంపాదకులు:
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
ఎమ్ ఏ విద్వాన్
బి బాలకుమార్ ఎమ్ ఏ బి యల్

సభ్యులు
కె వి ఎస్ గోవిందరావు బి ఏ, ఎల్ ఎల్ బి.
కె వి ఎస్ శరత్‌బాబు, బి ఏ బి కామ్
కె వి ఎస్ విజయ కుమార్
కె రత్నకుమారి


### చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000 00 |
| జీవిత చందా | 200 00 |
| 3 సంవత్సరాలకు | 33 00 |
| సంవత్సర చందా | 12 00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 75 00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 40 00 |


చందాలు పంపవలసిన చిరునామా

విస్డమ్ పబ్లికేషన్స్,
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు 600 004


## ఈ సంచికలో

ఫిబ్రవరి 1983



ముఖచిత్రం - కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
శ్రీమతి మంజుల, మీరట్ (ఉ. ప్ర.)

**తెలుగు 'విస్డమ్' కు ఇది రెండో సంవత్సరం**

## ధ్యానం

### ఆత్మ పరిపక్వత



జేమ్స్ ఎలెన్

ఆత్మ పరిపక్వత కలగడం అంటే — చుట్టూ ఉన్న మనుష్యుల్నీ, వస్తువుల్నీ స్వార్థ దృష్టితో చూసే మామూలు పద్ధతి అంతరించిపోవడం. దీనివల్ల పూర్తిగా క్రొత్త అనుభవాలు కలుగుతాయి. ఒక చిన్న సుఖం మీది కోరికను సమూలంగా పెకలించివేస్తే, ఆ కోరికకు కారణం అయిన మానసిక శక్తి నశించి పోదు. మరింత ఉన్నత స్థాయిలో, మరింత స్వచ్ఛమైన శక్తిగా అది ప్రకటితం అవుతుంది. "శక్తికి హాని లేదు" అనే సూత్రం అన్ని విషయాలలోనూ వర్తిస్తుంది. దిగువ స్థాయిలో నిరోధించబడిన శక్తి ఉన్నతమైన ఆధ్యాత్మిక స్థాయిలో అభివ్యక్తం అవుతుంది. ●

## సంపాదకుని పేజీ

### సౌందర్య దృష్టి అలవరుచుకో!



"అందమైన వస్తువుల మీది మక్కువను మా హృదయాల నుంచి తొలగిస్తే మా జీవితాల శోభనే మీరు హరించి వేసిన వారవుతారు" అంటాడు సుప్రసిద్ధ ఫ్రెంచ్ రచయిత, తత్త్వవేత్త అయిన రూసో. ఈ ప్రపంచంలో జన్మించిన ప్రతి ఒక్కరూ సౌందర్యం విలువను తెలుసుకోవాలి. సర్వ సంపూర్ణ సౌందర్యరూపుడైన దేవుని ఉనికిని గ్రహించడానికి ఇదే సరియైన మార్గం. దివ్య ప్రేమను అర్థం చేసుకోడానికి సౌందర్య దృష్టి అలవరుచుకోవడం అవసరం. అందమైన ఏ వస్తువునైనా చూచి ఆనందించే అవకాశం జార విడువ కూడదు. అందం దేవుని ప్రతిరూపం. ప్రతి సొగసరి ముఖంలోనూ, ప్రతి అందమైన ఆకాశంలోనూ, ప్రతి మనోహరమైన పుష్పంలోనూ

" 'సత్యా' నికి మనం చేయగల గొప్ప సేవ దానిని ఉపయోగించుకోడం!" —జేమ్స్ రసెల్ లోవెల్

కనిపించే సౌందర్యానికి ఆనందంగా మనం స్వాగతం చెప్పాలి. 'అందం' అనే నాశన మెరుగని దీవెనను మన కిచ్చినందుకు దేవుడికి మనం కృతజ్ఞత తెలపాలి.

సర్వ సంపూర్ణం కావడంవల్ల సౌందర్యం మనస్సుకి హాయి చేకూరుస్తుంది. ప్రతి జీవిత రంగంలోనూ మానవుని హృదయం సౌందర్యం కోసం తహ తహ లాడుతుంది. దేవుని దృష్టిలోని అందమైన వస్తువు లన్నీ ప్రతి స్త్రీకీ, ప్రతి పురుషుడికీ ఆయన ఇచ్చిన కానుకలు. సౌందర్యం కోసం దూర ప్రాంతాలకు పోయి అన్వేషించ నక్కర లేదు. మన చుట్టూ ఎక్కడ పడితే అక్కడే సౌందర్యం ఉంది.

ఆకాశంలో కనిపించే రంగు రంగుల ఇంద్ర ధనుస్సులో, మధురమైన తావులు వెదజల్లుతూ ఉదయవేళ విచ్చుకునే గులాబీ పూవులో, మంచుతో కప్పబడిన ఎత్తైన హిమాలయ పర్వత శిఖరాలలో - సర్వత్ర అద్భుతమైన సౌందర్యం కనిపిస్తుంది. మన హృదయాలను ఆకర్షించే ఈ అందమైన వస్తువు లన్నీ దేవుని ప్రతిరూపాలే!

'సౌందర్యం ఈ అంశంలో ఉంది' అని నిర్దేశించడం సాధ్యం కాదు. ఇంద్ర ధనుస్సు లాంటి చిత్రమైన రంగుల వస్తువులలో కొందరికి సౌందర్యం గోచరించవచ్చు. గులబీపూల మత్తెక్కించే పరిమళంలో మరి కొందరికి సౌందర్యం కనిపించవచ్చు. ఇంక కొందరికి ప్రశాంతమైన హిమాలయ పర్వత ప్రాంతాలు సౌందర్య నిలయాలుగా తోచవచ్చు. ఇలా - ఎన్ని తేడా లున్నా మనం అందరం

## బొమ్మలలో హాస్య




అందాన్ని గ్రహిస్తూనే ఉన్నాం, అనుభవిస్తూనే ఉన్నాం, ఆనందిస్తూనే ఉన్నాం.

సౌందర్యం మనస్సులో అలజడి తొలగిస్తుంది; ఉద్వేగాలను అణచివేస్తుంది; ఉదాత్తతను కలిగిస్తుంది; వెలుగు నిస్తుంది. సుప్రసిద్ధ ఆంగ్ల కవి కీట్స్ సౌందర్య నిజ స్వరూపాన్ని సందర్శించి, పరవశుడైపోయి ఇలా గానం చేశాడు: "అందమైన వస్తువు-అవధు లెరుగని ఆనందానికి హేతువు!"

సౌందర్యాన్ని దూరం నుంచే ఆస్వాదించాలి. దగ్గిరకు తీసుకొని స్వంతం చేసుకోబోతే దాని ఆకర్షణ అంతరిస్తుంది.

కవిత్వం, సంగీతం, చిత్రకళ, నాట్యం, లాంటి లలిత కళ లన్నీ సౌందర్యం నుంచి పుట్టినవే! కళలు లేని జీవితం నిస్సారమైంది.

జీవితాన్ని ఆనంద ధామం చేసుకోవాలంటే అందరూ సౌందర్య దృష్టిని అలవరుచు కోవాలి!

"'మారితే సమూలంగా మారాలి; లేకపోతే మార్పే వద్దు'
అనే వారివల్లే ఎక్కువ ప్రమాదం!" —లేడీ ఆస్టర్

# స్పాట్ లైట్

## 1982 ఆసియా క్రీడోత్సవాలు

9వ ఆసియా క్రీడోత్సవాలు 1982 నవంబరు 19 మొదలు డిసెంబరు 4 వ తేదీ దాకా న్యూఢిల్లీ నగరంలో మహా వైభవంగా జరిగాయి. ఢిల్లీలో ఆసియా క్రీడోత్సవాలు



అప్పూ

జరగడం ఇది రెండవసారి. మొట్ట మొదట 1951 మార్చి నెలలో ఢిల్లీలోనే ఆసియా క్రీడోత్సవాలు ప్రారంభ మయాయి. వెనుకటి ఆసియా క్రీడోత్సవాలకు సంబంధించిన వివరాలు:

| స్థలం | సంవత్సరం |
|---|---|
| 1. న్యూఢిల్లీ (ఇండియా) | 1951 |
| 2. మణిల్లా (ఫిలిప్పీన్) | 1954 |
| 3. టోకియో | 1958 |
| 4. జకార్తా (ఇండోనీషియా) | 1962 |
| 5. బాంగ్‌కాక్ (థాయ్‌లాండ్) | 1966 |
| 6. బాంగ్‌కాక్ (థాయ్‌లాండ్) | 1970 |
| 7. టెహరాన్ (ఇరాన్) | 1974 |
| 8. బాంగ్‌కాక్ (థాయ్‌లాండ్) | 1978 |
| 9. న్యూఢిల్లీ (ఇండియా) | 1982 |

1970 దాకా క్రీడారంగంలో ఆసియా దేశాలలో జపాన్ ఆధిక్యాన్ని తీవ్రంగా సవాలు చేసిన దేశం మరొకటి లేదు. కాని, ఆ తరువాత క్రొత్తగా అంతర్జాతీయ క్రీడల పోటీలలో అడుగు పెట్టిన చైనా జపాన్‌తో తీవ్రంగా పోటీపడ సాగింది. చివరికి న్యూఢిల్లీలో జరిగిన 9 వ క్రీడోత్సవాలలో జపాన్ 57 సువర్ణ పతకాలే గెల్చుకోగా, చైనా 61 సువర్ణ పతకాలు సాధించి జపాన్‌ను రెండో స్థానానికి నెట్టివేసింది. దక్షిణ కొరియా (28 సువర్ణ పతకాలు), ఉత్తర కొరియా (17 సువర్ణ పతకాలు), వరుసగా 3వ, 4 వ స్థానాలు ఆక్రమించగా, 13 సువర్ణ పతకాలతో ఇండియా 5 వ స్థానంలో ఉంది.

వెనుక కాళ్ళమీద పైకి లేచిన 'అప్పూ' అనే ఏనుగు గున్నని 9వ ఆసియా క్రీడోత్సవాల చిహ్నం (mascot) గా గ్రహించారు. ఢిల్లీలోని 'జంతర్ మంతర్' వేధశాల

(observatory) ఆకారం మరొక చిహ్నం (Logo).



ఆసియా క్రీడోత్సవ చిహ్నం

9 వ ఆసియా క్రీడోత్సవాల కోసం భారత ప్రభుత్వం చేసిన ఏర్పాట్లను వివిధ దేశాల క్రీడాకారుల బృందాలు విశేషంగా ప్రశంసించాయి. ఈ ఉత్సవాల కోసం ప్రత్యేకంగా నిర్మించిన స్టేడియమ్‌లకూ, 853 ఇళ్ళతో కూడిన ఆసియా క్రీడల గ్రామ నిర్మాణానికీ మొత్తం 8 కోట్ల ఇటికలూ, 10,000 టన్నుల సిమెంటూ, 90,000 టన్నుల ఉక్కూ ఉపయోగించబడ్డాయి! ఈ ఉత్సవాలు జరుపడానికి మొత్తం రూ. 600 కోట్లు ఖర్చయాయి. రెండంతస్తులతో నిర్మించిన 75,000 మంది ప్రేక్షకులు పట్టే ప్రధానమైన స్టేడియమ్‌కి 'జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియమ్' అని పేరు పెట్టారు. ప్రపంచంలో మిక్కిలి పెద్ద స్టేడియమ్‌లలో ఇది మూడోది. మొదటి రెండూ మాంట్రీల్ (కెనడా), టెహరాన్ (ఇరాన్)లలో ఉన్నాయి.

1982 నవంబరు 19 న జరిగిన ప్రారంభోత్సవంలో 33 ఆసియా దేశాల నుంచి వచ్చిన సుమారు 4,000 మంది క్రీడాకారులు భారత రాష్ట్రపతి జైల్‌సింగ్‌కు వందన సమర్పణ చేశారు. మిలిటరీ బ్యాండు వాద్యంతో శుభప్రదంగా ఉత్సవాలు ఆరంభం అయాయి.

పోటీలు నిర్వహించే క్రీడలలో ఈ సారి గుర్రపు పందేలు, గోల్ఫ్, పడవ నడపడం, చేతిబంతి క్రీడలను కూడా క్రొత్తగా చేర్చడం జరిగింది. 9 వ ఆసియా క్రీడోత్సవాలలో మొత్తం 21 క్రీడలలో పోటీలు జరిగాయి. వీటిలో 19 మాత్రమే ఢిల్లీలో జరిగాయి. తెరపడవల పందేన్ని (yachting)



సువర్ణ పతకం

"జీవితంలో తొలి సగం తల్లిదండ్రుల వల్లా,
తరువాతి సగం పిల్లల వల్లా నాశనం అవుతుంది" —బారో క్లారెన్స్

బొంబాయిలోనూ, తెడ్ల పడవల పోటీని (rowing) రాజస్థాన్‌లోని జయపూర్ సమీపం లోనూ నిర్వహించారు.

సువర్ణ పతకాలు సాధించే విషయంలో 1951 నాటి న్యూఢిల్లీ క్రీడోత్సవాలలో (15 సువర్ణ పతకాలు) కంటె 9 వ ఆసియా క్రీడోత్సవాలలో (13 పతకాలు) 2 పతకాలు తక్కువగానే గెలుచుకున్నా మొత్తం మీద టెహరాన్ (28), బాంగ్‌కాక్ (28) ఉత్సవాలలోకంటె రెట్టింపు పతకాలు (57) ఈ సారి ఇండియా సాధించింది.

9 వ ఆసియా క్రీడోత్సవాలలో సువర్ణ, రజత పతకాలు సాధించి క్రీడారంగంలో భారతీయుల ప్రశస్తికి వన్నె పెట్టిన ప్రముఖ భారత క్రీడాకారులలో ఈ క్రిందివారు ప్రధానంగా పేర్కొనదగినవారు:

| పేరు | పందెం | సాధించిన పతకం |
|---|---|---|
| 1. రఘుబీర్ సింగ్ | గుర్రపు పందెం | సువర్ణపతకం |
| 2. లక్ష్మణసింగ్ | గోల్ఫ్ | |
| 3. ఎం. డి. వలశమ్మ | 400 మీటర్లు (58.47 సె.లు) | |
| 4. చంద్‌రామ్ | 20 కి.మీ. నడక (1 గం. 29 ని. 29 సె.) | |
| 5. ఎలిజా నెల్సన్ (కెప్టెన్) | స్త్రీల హాకీ పోటీ | |
| 6. ఛార్లెస్ బరోమియా | 800 మీ.లు (1 ని. 46 81 సె.లు) | |
| 7. పి. టి. ఉష | 200 మీ.లు (24.32 సె.లు) 100 మీ.లు (11.95 సె.లు) | రజతపతకం |
| 8. గీతా జుట్షీ | 1500 మీ.లు (4 ని. 19 33 సె.లు) 800 మీ.లు | |

న్యూఢిల్లీ ఆసియా క్రీడోత్సవాలు ఇండియా క్రీడాకారులకు క్రీడల పట్ల ఆసక్తిని మరింత పెంపొందించడంతో ముందు ముందు జరుగబోయే అంతర్జాతీయ క్రీడోత్సవాలలో ఇండియా మరింత ఎక్కువగా తన ప్రతిభను ప్రదర్శించ గలదని ఆశించవచ్చు. ●

"విమర్శించేవారు కాదు,
ఒరవడి పెట్టేవారు పిల్లలకు అవసరం!" —జోసెఫ్ జౌబర్ట్

# టూరిస్టుల నందనవనం
# మైసూరు

అందమైన వీధులతో, సుందరమైన పార్కులతో కన్నుల విందు చేసే మైసూరుకి ఇండియాలోని పరిశుభ్రమైన నగరాలలో ఒకటి అని ప్రసిద్ధి! దుర్గచేత వధించబడిన



మైసూరు రాజభవనం గేటు

మహిషాసురుని పేరే ప్రజల నోళ్ళలో నలిగి క్రమంగా 'మైసూరు' అయింది.

'చాముండీశ్వరి' కొండ ప్రక్కగా వ్యాపించి ఉన్న మైసూరు నగరానికి ఆ కొండ ఒక పెట్టని అలంకారం. శతాబ్దాల తరబడి ఒక సుప్రసిద్ధ రాజవంశం పాలనలో ఈ నగరం ఎన్నో అందచందాలు దిద్దుకుంది.

ప్రాతకోట మధ్యలో ఉన్న మహారాజు ప్రాసాదం ఇండియాలోని చాలా అందమైన భవనాలలో ఒకటి. నిర్మాణానికి 14 సం.లు కాలం పట్టిన, 145 అ.ల ఎత్తు గల ఈ రాజ ప్రాసాదం అందరినీ విశేషంగా ఆకర్షిస్తుంది. భూమట్టం నుంచి పైదాకా భవనం ముందు భాగం అద్భుతమైన శిల్పాలతో అలంకరించబడింది. పలు విధాలైన రాళ్ళతో నిర్మించ

## ముఖచిత్ర వ్యా

(డిసెంబరు 1982)

"నీ హారం మాకు వద్దు
నీవే మాకు ముద్దు!"

—ఇ. విశ్వనాథ ప్రసాద్,
అనంతపురం.

* * *

"లేత కళ్ళ నవ్వులో
ఎన్ని కోట్ల దివ్వెలో!"

—ఎమ్. అరుణ,
కావలి (నెల్లూరు జిల్లా)

"మూర్ఖతనుంచి అనుభవం,
అనుభవం నుంచి వివేకం కలుగుతాయి!" -సాచా గిటే

బడిన ఈ భవనం ఇండియాలోని రాతి కట్టడా లలో నిరుపమాన మైంది.

కర్ణాటక రాష్ట్రానికి గర్వకారణా లైన మేలి రకం సిల్కు, చందనపు తైలం మైసూరులో ఉత్పత్తి అవుతున్నాయి. ఇక్కడి 'గవర్నమెంట్ సిల్కు వీవింగ్ ఫాక్టరీ'లో స్విస్, ఫ్రెంచ్ మగ్గాలమీద జార్జెట్, క్రేప్-డి-చీనె, శాటిన్ మొదలైన మేలిరకం సిల్కు వస్త్రాలూ, సిల్కు జేబు రుమాళ్ళూ, సిల్కు నెక్ టైలూ తయా రవుతున్నాయి. ప్రభుత్వ



రాజప్రాసాదం

చందన తైల కర్మాగారంలో పరిశుద్ధమైన, అధిక సువాసన గల చందనతైలం ఉత్పత్తి అవుతూంది.

మైసూరులో టూరిస్టులను ప్రధానంగా ఆకర్షించేది 'చాముండి' కొండ. కొండమీదికి 14 కి.మీ.ల పొడవున రోడ్డు ఉంది. కొండ శిఖరం మీద ఒక చక్కని తోట, అందమైన చాముండి (దుర్గ) ఆలయం ఉన్నాయి. కొండ ఎక్కే దారిలో ఒకే శిలలో మలచిన ఒక పెద్ద నందీశ్వరుడి విగ్రహం తప్పక చూడదగింది.

మైసూరులోని జంతు ప్రదర్శనశాల ఇండియాలో పేరెన్నిక గన్నది. పలు రకాల పక్షులనూ, జంతువులనూ, పాములనూ ఇక్కడ చూడవచ్చును.

జగన్ మోహన్ ప్యాలెస్‌లో అపురూపమైన చిత్రపటాలూ, ఒక చిన్న మ్యూజియం ఉన్నాయి మైసూరులోని చామ రాజేంద్ర టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ సుప్రసిద్ధమైంది. ఇక్కడ చెక్కే దంతపు బొమ్మలూ, లోహ విగ్రహాలూ ప్రశస్తమైనవి. ఇక్కడ తయారైన దేవతల తాలూకు లోహ విగ్రహాలలో మంచి పనితనం కనిపిసుంది.



లలితా మహల్

నగరంలో దర్శించవలసిన ఇతర ప్రధాన స్థలాలు: 'మానస గంగోత్రి' అనబడే మైసూరు విశ్వవిద్యాలయ భవనాలూ, కర్జన్ పార్కు, లలితా మహల్, 'ది సెంట్రల్ ఫుడ్ టెక్నాలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్':

అత్తరులూ, సుగంధ ధూప ద్రవ్యాలూ తయారుచేసే అనేక కుటీర పరిశ్రమలు కూడా మైసూరులో ఉన్నాయి.

ఇండియాలో అన్ని ప్రాంతాలలోనూ, నేపాల్‌లోనూ హిందువులు ప్రధానంగా

(మిగతా 46వ పేజీలో)

'అన్నిటికీ సిద్ధపడు: మేలే ఆశించు: లభించిన దానితో తృప్తిపడు:''

# థియసాఫికల్ సొసైటీ కథ

ఎస్. సి. రామానుజాచార్య



['శ్రీ విరించి' అనే కలం పేరుతో తెలుగులో ఎన్నో కథలు వ్రాయడమే కాక, తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ అనేక వ్యాసాలు ప్రకటించి ఉన్న శ్రీ ఎస్. సి. రామానుజాచార్య సుప్రసిద్ధ థియాసఫిస్టు. ప్రస్తుతం అడయారులోని 'థియసాఫికల్ సొసైటీ' అంతర్జాతీయ కేంద్ర కార్యాలయంలో 'వసంత ప్రెస్' మేనేజరుగానూ, థియసాఫికల్ సొసైటీ ఇండియా శాఖకు జాతీయోపన్యాసకులుగానూ పని చేస్తున్నారు].

'థియాసఫీ' అనే గ్రీక్ పదానికి 'దివ్య జ్ఞానం' (divine wisdom) అని అర్థం. 1875 నవంబరు 17న న్యూయార్కు నగరంలో 'థియసాఫికల్ సొసైటీ' మొదట స్థాపించబడింది. హిమాలయ పర్వతాలలోని మహర్షుల దివ్య ప్రేరణతో కర్నల్ హెచ్. ఎస్. అల్కాట్ అనే ఒక అమెరికన్ జాతీయుడూ, అమెరికన్ పౌరసత్వం పొందిన రష్యన్ మహిళ మేడమ్ హెచ్.పి. బ్లావట్ స్కీ కలసి ఈ సొసైటీని స్థాపించారు. అతీంద్రియ శక్తుల (occult powers) ను గూర్చిన పరిశోధనకు ఉభయులూ కంకణం కట్టుకున్నారు.

కర్నల్ హెచ్. ఎస్. అల్కాట్ ఈ సొసైటీకి వ్యవస్థాపక అధ్యక్షుడు. 1907 లో దేహయాత్ర చాలించే దాకా ఆయనే ఈ సొసైటీకి అధ్యక్షులు. అటు తర్వాత వరు

---

## అమెరికాలో విదేశీ విద్యార్థులు

అమెరికాలో వేర్వేరు కళాశాలలలో చదువుకుంటూన్న విదేశీ విద్యార్థుల సంఖ్య 1982 లో రికార్డు స్థాయికి - 3,26,299 మందికి పెరిగింది. సదరన్ కాలిఫోర్నియా, విస్కాన్సిన్ (మాడిసన్), టెక్సాస్ (ఆస్టిన్), కొలంబియా (బోస్టన్) యూనివర్సిటీలలో విదేశీ విద్యార్థులు ఎక్కువగా ఉన్నారు. వీరిలో ప్రథమ స్థానం ఇరాన్ విద్యార్థులది; ఇండియాది ఏడవ స్థానం.

"వ్యక్తిగా ప్రతివారినీ గౌరవించు,
కాని ఎవరినీ విగ్రహంగా మార్చకు." —ఆల్బర్ట్ ఐన్‌స్టైన్

సగా ఈ క్రింది వారు అ ఱగా ఎన్నికై ఆ పదవీ బాధ్యతలను నిర్వహించారు. సాధారణంగా అధ్యక్షుని పదవీ కాలం 7 ఏళ్ళు.



కర్నల్ హెచ్. ఎస్. ఆల్కాట్

అనీ బిసెంట్ (1907-33)
జి. ఎస్ అరండేల్ (1933-45)
సి. జినరాజదాస (1945-53)
ఎన్. శ్రీరామ్ (1953-73)
జాన్ బి.ఎస్. కోట్స్ (1973-79)
రాధా బర్నియర్ (1980—)

తన 106 సంవత్సరాల జీవిత కాలంలో థియసాఫికల్ సొసైటీ 'విశ్వ మానవ సౌభ్రాత్రం', 'ఆత్మ ఏకత్వం' (oneness of life), 'మానవ ప్రగతికి అనువైన మార్గాలు' వంటి తన ఉదాత్త లక్ష్యాలను ప్రపంచంలో విరివిగా ప్రచారం చేసింది.

మొదట న్యూయార్క్‌లో స్థాపించబడిన ఈ సొసైటీ తన అంతర్జాతీయ కార్యస్థానం నెలకొల్పడానికి అనుకూలమైన స్థలం కోసం అన్వేషణ ప్రారంభించింది. సొసైటీ స్థాపకులకు కనిపించకుండా మార్గనిర్దేశం చేస్తూ వచ్చిన మహర్షులు ఆ అన్వేషణలో వారు ఇండియా వచ్చేట్టు చేశారు. మద్రాసు పరిసరాలలోని అడయారు ప్రాంతం చూడగానే అది వారిని ఆకర్షించింది. కర్నల్ హెచ్. ఎస్. ఆల్కాట్ తన డైరీలో ఇలా వ్రాసుకున్నారు: "ప్రథమ వీక్షణంలోనే అడయారు ప్రాంతం భవిష్యత్తులో మా శాశ్వత అంతర్జాతీయ కేంద్రం కాబోతున్నది అని మాకు తోచింది." అప్పుడు 27 ఎకరాల విస్తీర్ణం గల ఆ ప్రాంతాన్ని 'హడిల్ స్టోన్స్ గార్డెన్స్' అనే వారు. ఈ సంఘటన జరిగింది 1882లో. అందుకే 1982 అడయార్ అంతర్జాతీయ కార్యస్థానానికి శత జయంతి సంవత్సరం అయింది. 1982 డిసెంబరు నెల

## సంఖ్యలతో గారడీ

$1 \times 9 + 2 = 11$
$12 \times 9 + 3 = 111$
$123 \times 9 + 4 = 1111$
$1234 \times 9 + 5 = 11111$
$12345 \times 9 + 6 = 111111$
$123456 \times 9 + 7 = 1111111$
$1234567 \times 9 + 8 = 11111111$
$12345678 \times 9 + 9 = 111111111$

సేకరణ: బి. బ్రహ్మానందం,
వెల్లలచెరువు (ప్రకాశం జిల్లా)

"దేవుడు మసీదుల్లో మాత్రమే ఉంటే తక్కిన ప్రపంచానికి ప్రభు వెవరు?" —కబీరు

ఆఖరు వారంలో జరిగిన వార్షిక అంతర్జాతీయ థియాసఫిస్టుల సమావేశంతో పాటు ఈ శత జయంతి ఉత్సవాలు కూడా వైభవంగా జరిగాయి.

ఈ అంతర్జాతీయ సంస్థకు భావ స్వాతంత్ర్యం ఉన్న అన్ని దేశాలలోనూ జాతీయ శాఖా కార్యాలయాలు ఉన్నాయి. ఇండియా జాతీయ కార్యాలయ కేంద్రస్థానం వారణాసి.



మాడమ్ బ్లావట్స్కీ

తమ తమ నమ్మకాలనూ, సిద్ధాంతాలనూ, ఆచారాలనూ విడిచిపెట్టకుండానే వివిధ మతాల వారు ఈ సంస్థలో సభ్యులుగా చేర వచ్చు. అలా సభ్యుడు కావడానికి ఒకే ఒక షరతు: ఈ సంస్థ తాలుకు ఈ క్రింది మూడు లక్ష్యాలనూ ఆమోదించడం.

1. జాతి, మత, కుల, వర్ణ, లింగ వివక్షణ లేని 'విశ్వమానవ సౌభ్రాత్రం' స్థాపించడానికి కృషిచేయడం.

2. మతాలు, తత్త్వశాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాల సాపేక్ష పరిశోధనలను ప్రోత్సహించడం.

3. అభివ్యక్తం కాని ప్రకృతి శక్తులను గూర్చి, మానవునిలో నిగూఢంగా ఉన్న శక్తులను గూర్చి పరిశోధనలు సాగించడం.

ఈ సంస్థ సభ్యులు తమకు ఇష్టమైన మతాన్ని తాము అనుసరించ వచ్చు; కాని తన మతాన్నే అనుసరించమని ఇతరులను బలాత్కరించ కూడదు.

మత వర్గాల మధ్య ఉన్న అపోహలను

## ప్రపంచంలోని ఏడు వింతలు

1. ఈజిప్టులోని పిరమిడ్లు (క్రీ.పూ. 2000),

2. బాబిలోన్ (గ్రీస్) లోని వ్రేలాడే పూతోటలు (క్రీ.పూ. 600),

3. ఒలింపియాలో ఉన్న జ్యూస్‌విగ్రహం (క్రీ.పూ. 400),

4. ఈఫిసస్ అనే ప్రదేశంలో ఉన్న ఆర్టిమిస్ (డియానా) దేవాలయం (క్రీ.పూ. 350-230),

5. హాలికార్నసస్ అనే ప్రదేశంలో సమాధి (క్రీ.పూ. 353),

6. రోడ్జ్ దీవిలోని 'హీలియోస్' (సూర్య భగవానుడి) పెద్ద కంచు విగ్రహం (క్రీ.పూ. 280),

7. అలెగ్జాండ్రియాలోని పాలరాతి లైట్ హౌస్ (క్రీ.పూ. 270).

సేకరణ: కోలవెన్ను శ్రీనివాసు, గుంటూరు.

"మాట కన్నా, క్రియ కన్నా కూడా మౌనం మిన్న!" - —వినోబా భావే

తొలగించి అన్ని మతాల వారినీ ఒక చోటికి చేర్చడానికి ఈ సంస్థ సభ్యులు కృషి చేస్తారు. వారి దృష్టిలో అన్ని మతాలూ దివ్యజ్ఞానాన్ని ప్రతిపాదించేవే! వాటిని ఖండించడం గాక, అధ్యయనం చేయడం, ఇతరులను తమ మతంలో చేర్చుకోడం కాక, తమ మతాన్ని శ్రద్ధగా అనుష్ఠించడం వారి ధ్యేయాలు.

అడయారు నది బంగాళాఖాతంలో కలిసే సంగమ స్థానం వద్ద 250 ఎకరాల విస్తీర్ణం గల ప్రాంతంలో 'థియసాఫికల్ సొసైటీ' అంతర్జాతీయ కార్యాలయం పనిచేస్తూంది.

ఈ విశ్వాన్ని నడిపిస్తున్న ప్రకృతి సూత్రాలను గురించి అమూల్యమైన గ్రంథాల నెన్నిటినో సొసైటీ ప్రకటించింది. వివిధ జాతుల మధ్య కూడా సోదర భావాన్ని పెంపొందించడానికి ఈ సొసైటీ కృషి చేస్తూంది. అడయారు కేంద్రంలో ఉన్న అతి ప్రాచీన మైన మర్రి చెట్టు యాత్రికు లను విశేషంగా ఆకర్షిస్తూంది. ●

---

## భావపరిచయ పోటీ
(డిసెంబరు 1982)

"అమ్మ బాబోయ్!
అసలు సంగతి పసి కట్టింది!"

—జి. బాల చంద్రయ్య,
జడ్చర్ల (మహబూబ్ నగర్ జిల్లా)

* * *

"పలకరిస్తే ప్రేమాయాణం
కరవ వస్తే పలాయనం!"

—ఇంద్రగంటి మధుసూదనరావు,
నెల్లూరు.

* * *

"భలే మంచి నాటకం!
పసందైన గుణపాఠం!"

—సూరెడ్డి ఆనంద చౌదరి,
సాలూరు (విజయనగరం జిల్లా).

---

## కళ్లద్దాల పని లేని కొత్త కళ్ల ఆపరేషన్



'రిఫ్రాక్టివ్ కెరటో ప్లాస్టీ' అనే ఒక కొత్త రకం కళ్ళ ఆపరేషన్ ద్వారా ఇటీవల మద్రాసు సమీపంలోని గూడవాంచేరి గ్రామానికి చెందిన 57 ఏళ్ళ వయస్సు గల నటరాజన్ అనే రైతుకి కళ్ళు నయం చేశారు. అత్యాధునికమైన ఈ ఆపరేషన్‌ని యూరప్‌లోని కొద్ది దేశాలలోనూ, అమెరికాలోనూ మాత్రమే చేస్తున్నారు. రూ. 10 లక్షలు ఖరీదు చేసే కంప్యూటర్ అమర్చిన పరికరాలతో చేసే ఈ ఆపరేషన్ అనంతరం రోగికి కళ్ళ అద్దాలు వాడే పని ఉండదు.

---

"జీవితంలో ఒక్కటే నిజమైన విజయం:
మన ఇష్టం వచ్చినట్టు మనం జీవించ గలగడం." —క్రిస్టఫర్ మార్లీ

# జాతీయ వార్తలు

## సంస్కృతి కేంద్రం - 'భారత్ భవన్'

మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని భోపాల్‌లో ఇటీవల 'భారత్ భవన్' అనే ఒక సంస్కృతి కేంద్రాన్ని ప్రారంభించారు. ఇలాంటి కేంద్రాలు ఇండియాలో స్థాపించడం ఇదే ప్రథమం. లలిత కళలకు సంబంధించిన మ్యూజియమ్, ఇండియాలోని అన్ని భాషల కావ్యాలనూ సేకరించే లైబ్రరీ, శాస్త్రీయ, లలిత సంగీతాల రికార్డుల శాఖ, రెండు ఆడిటోరియాలూ (ఒకటి ఆరు బయలు ఆడిటోరియం), లలిత కళల కర్మాగారం, కళాకారులకు క్వార్టర్స్ మొదలైన వివిధ భవనాలతో కూడిన సంకీర్ణ కేంద్రం ఇది.

* * *

## సోవియెట్ అంతరిక్ష నౌకలో ఇండియన్ వ్యోమగాములు:

అంతరిక్ష పరిశోధనలో ఇండో - సోవియెట్ సహకార కార్యక్రమాలలో భాగంగా రెండేళ్ళుగా రష్యాలో శిక్షణ పొందుతున్న భారతీయ వ్యోమగాములు త్వరలోనే ఒక రష్యన్ ఉపగ్రహంలో అంతరిక్షంలో విహరించబోతున్నారు.

## ఆకులు, అలమల మీద బ్రతికే ఆదిమ జాతి ప్రజలు



లక్నోలోని 'నేషనల్ బొటానికల్ సర్వే' వారి నివేదిక ననుసరించి ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో మిరాజ్‌పూరు జిల్లాలో తరుచు కరువుతో, అంటుజాడ్యాలతో బాధపడుతూ ఉండే ఆదిమ జాతి ప్రజలు ప్రతి ఏడూ 3, 4 నెలల పాటు కేవలం ఆకులూ, అలమలూ తిని బ్రతుకుతున్నారు. గోండ్‌లు, కోల్‌లు, భిల్లులు అనబడే ఈ తెగలవారు 2,60,000 హెక్టేర్ల ప్రాంతంలో గల 400 గూడేలలో నివసిస్తున్నారు.

"క్రీడలకు టైం లేనివారు
రోగాలకు టైం ఇవ్వవలసి వస్తుంది." —జాన్ వనమకర్

## లండన్‌లో ఎగ్జిబిషన్‌కి ప్రాచీన ఇండియన్ శిలా ఫలకం:

మధ్యప్రదేశ్‌లోని ఖార్‌హుట్ త్రవ్వకాలలో లభించిన 2,200 ఏళ్ళనాటి ఒక ప్రాచీన శిలా ఫలకాన్ని కలకత్తాలోని ఇండియన్ మ్యూజియమ్ వారు లండన్‌లో జరిగే 'ఇండియా ఉత్సవాల' ఎగ్జిబిషన్‌లో ప్రదర్శనకు పంపారు. 56 సెం.మీ. ల పొడుగున్న ఈ శిలా ఫలకాన్ని రూ. 5 లక్షలకు ఇన్స్యూర్ చేశారు.

* * *

## కేరళలో నావిక శిక్షణ కేంద్రం!

కేరళలోని కణ్ణనూర్‌కి 40 కి.మీ. ల దూరాన గల ఎళిమల (ezhimala) లో నౌకాదళంలోని ఆఫీసర్లకు శిక్షణ ఇచ్చే కేంద్రాన్ని (naval academv) స్థాపించడానికి ఇండియా ప్రభుత్వం ఆమోదం తెలిపింది. ఏకకాలంలో 500 మంది ఆఫీసర్లకు ఇక్కడ శిక్షణ ఇస్తారు.

* * *

## వ్యవసాయ శాస్త్రజ్ఞునికి నెహ్రూ అవార్డ్:

ఖాండ్వా (మధ్యప్రదేశ్) లోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన కేంద్రానికి ఒదిన వృక్ష రోగ శాస్త్ర నిపుణుడు అశోక కృష్ణ 1981 నెహ్రూ అవార్డు అందుకున్నారు. రూ. 5,000 ల నగదు రూపమైన ఈ అవార్డును 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చ్' వారు ఏటేటా ఉత్తమ వ్యవసాయ పరిశోధన జరిపిన ఒక శాస్త్రవేత్తకు ఇస్తారు.

* * *

## 'అమర వీరుల' పార్క్‌కు శంకు స్థాపన:

పంజాబ్‌లోని ఫెరోజ్‌పూర్ సమీపాన ఉన్న హుసేనివాలాలో రు. 25 లక్షల వ్యయంతో నెలకొల్పనున్న 'అమర వీరుల' పార్క్ (martyrs' park) కి పంజాబు ముఖ్యమంత్రి ఇటీవల శంకుస్థాపన చేశారు. ●

---

## శిలలుగా మారిన ఎముకలు



పై చిత్రంలో కనిపించేది లక్షలాది సంవత్సరాలలో శిలలుగా మారిపోయిన ఎముకలు. పోర్చుగల్ దేశంలో ఒక పొలంలో ఇవి కనిపించాయి. వాటిలో మిక్కిలి చిన్న రాయి బరువు 12 కిలోలు. 'మెసోజోయిక్' యుగానికి చెందిన 'డినోసార్' అనే బృహత్ సరీసృపం తాలూకు తోకలోని ఎముకలు ఇవి.

"అధికారం పెరిగిన కొద్దీ, దాని దుర్వినియోగం మరింత ప్రమాదకరం అవుతుంది!" —ఎడ్మండ్ బర్క్

# మీ పేజీ

(ఫిబ్రవరి 1983)

**శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ**

కే. వెంకటేశ్వరరావు, అత్తిలి (ప.గో. జిల్లా).

"'ఆలస్యం అమృతం విషం' అన్న పెద్దలే 'నిదానమే ప్రధానం' అంటారు - కామెంట్ ప్లీజ్! (ఉత్తమ ప్రశ్న)

* ఒకప్పుడది అవసరం - మరొకప్పుడు రెండోది అవసరం. కత్తి పండూ కోస్తుంది, గొంతూ కోస్తుంది.

* * *

పి. మహీధర్, ముత్తుకూరు.

"ఈ నాడు విజ్ఞానంతో సమానంగా అజ్ఞానం పెరుగుతోంది - కారణం?"

* నిజమైన విజ్ఞానం పెరిగితే అజ్ఞానం తరుగుతుంది నాయనా!

* * *

పద్మజా రెడ్డి, బెంగుళూరు.

"అవినీతితోనూ, అన్యాయాలతోనూ కూడిన ఈ ప్రపంచంలో బ్రతకడం దేని కోసం?"

* ఆశ చావక!

* * *

కే. వెంకటేశ్వరరావు, పండ్రంగి (విశాఖ జిల్లా).

"కంచి గరుడ సేవ అంటే ఏమిటండీ?"

## లోహాలను గుర్తించే పరికరం



తేలికగా వెంట తీసుకుని వెళ్ళదగిన 'లోహాలను గుర్తించే పరికరం' ఒకటి ప్రస్తుతం వాడుకలోకి వచ్చింది. భద్రత కోసం గేట్ల దగ్గిర పనివారి జేబులూ, సంచీలూ పరీక్ష చెయ్యడానికి దీనిని వాడుతున్నారు. 9 వాల్ట్ల బేటరీతో పనిచేసే ఈ పరికరం ఒక ధ్వని చేసి, లోహాల ఉనికిని తెలియజేసుంది.

"'చెడు' అయినా స్వధర్మాన్ని విడువకూడదు; నిప్పును పొగలాగ 'మంచి'ని 'చెడు' ఆవరించి ఉంటుంది." —భగవద్గీత

• దానికి చాలా అర్థాలు ఉన్నాయి నాయనా!

• • •

టి. సంతోష్ కుమార్, ఏలూరు (ప.గో. జిల్లా).

"'శ్రీలంక' స్వతంత్ర దేశం కదా! మరి భారతదేశ పటంలో దాని నెందుకు చూపిస్తారు?"

• చూపిస్తే నీదేం పోయిందయ్యా? చిన్నప్పటి నుంచీ చూస్తున్నాం - ఇప్పు డెందు కొచ్చింది నీ కా సందేహం?

• • •

జి. పద్మా రెడ్డి, జనగామ (వరంగల్ జిల్లా).

"ఇందిరమ్మ కోడలితో పోట్లాడడం అర్థ రహితం కదా?"

• అత్తా, కోడళ్ళ పోట్లాటలు అర్థరహితమో కాదో చెప్పలేను కాని, ఇందిరమ్మ కోడలితో పోట్లాడడం మాత్రం అర్థ సహితమే అయి ఉండవచ్చు.

• • •

బి. విజయ సారథి, ప్రత్తిపాడు (గుంటూరు జిల్లా).

"విద్యార్థి లోకానికి విజ్ఞానాన్ని అందిస్తున్న 'విస్‌డమ్'పై మీ అభిప్రాయం తెలుపుతారా?"

• ఆత్మ వ్యవసాయం అతి సులభంగా చేయించి, జ్ఞానం, విజ్ఞానం అనే ఫలాలను అందించే కల్పతరువు 'విస్‌డమ్' అని నా అభిప్రాయం - చాలా?

జలగం శ్రీనివాసులు నాయుడు, ముచ్చివోలు (చిత్తూరు జిల్లా).

"దేవుడూ, మంత్రాలూ లేవంటూ - పురాణాలనూ, వేదాలనూ, మతాన్నీ అపహసించే

(మిగతా 39వ పేజీలో)

## మానవుని అవతరణ కాకతాళీయం కాదు



"ఈ భూమిమీద కాకతాళీయంగా ఏర్పడ్డ వాడు కాడు మానవుడు. సముద్రాలు పొంగేట్టూ, గాలులు కదిలేట్టూ చేసే మహాశక్తే మానవునిలోనూ నిక్షిప్తమైఉంది. ప్రకృతిలో ప్రతి కదలికలో సామరస్యం సాధించే 'తెలివే' మానవునిలోనూ కనిపిస్తుంది. తనను తాను వశం చేసుకునేందుకు అవసరమైన బ్రహ్మానందం మానవునిలో నిండి ఉంది. హద్దులనూ, అడ్డంకులనూ పటాపంచలు చేసే 'సౌందర్యం' మానవునిలో ఉంది!" —స్వామి జ్యోతిర్మయానంద

# నిజాలు-నిదర్శనాలు

## మిక్కిలి తక్కువ శిశు మరణాలు:

అభివృద్ధి చెందిన దేశాలలో పుట్టిన ప్రతి 1,000 మంది శిశువులలో సగటున 20 మంది ఏడాది నిండకుండా మరణిస్తున్నారు. మిక్కిలి తక్కువ శిశు మరణాలు గల స్వీడెన్‌లో ఈ సంఖ్య 9 మాత్రమే. అభివృద్ధి కొరవడిన దేశాలలో 1,000 మంది శిశువులలో 113 నుంచి 140 దాకానూ, మరీ వెనుకబడిన దేశాలలో 200 దాకానూ కూడా మరణిస్తున్నారు.

* * *

## ఇండియాలో ఎడారి ప్రాంతం:

ప్రస్తుతం ఇండియాలోని భూ భాగంలో 12 శాతం ఎడారులతోనూ, వానలు లేక పంటలు పండని బంజరు భూములతోనూ నిండి ఉంది. రాజస్థాన్‌లో దాదాపు 71 శాతం, గుజరాత్‌లో 20 శాతం, పంజాబ్, హర్యానాలలో 9 శాతం ఎడారి ప్రాంతాలు. మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులలో కూడా బంజరు ప్రాంతాలు కొన్ని ఉన్నాయి.

* * *

## కేరళలో ఆయుః ప్రమాణం:

కేరళలో సగటు ఆయుః ప్రమాణం 60 ఏళ్ళ కంటె ఎక్కువ. ఇక్కడ శిశు మరణాల సంఖ్య అభివృద్ధి చెందిన దేశాలలోని సంఖ్యలో సగం కంటె కూడా తక్కువ.

* * *

## అమెరికన్ పిల్లల గంజాయి అలవాటు:

అమెరికాలో 12-17 ఏళ్ళ పిల్లలలో 31

---

## దేవుడు మనిషి నెందుకు సృష్టించాడు?



“ఇది ఆధ్యాత్మికమైన (transcenden-tal) ప్రశ్న. పరిమిత ప్రజ్ఞ గల అల్పమైన మన మనస్సులు ఆధ్యాత్మిక రహస్యాలు అర్థం చేసుకోలేవు. మనస్సును లయం చేసుకుని, సమ్యగ్ దృష్టి సాధిస్తే తప్ప సృష్టి ఎందుకు జరుగుతూందో ఆ రహస్యం అర్థం కాదు. ఈ లోగా ఆ ప్రశ్నకు జవాబు అన్వేషించడం గుర్రానికి ముందు బండిని కట్టడం లాంటిది.” —స్వామి శివానంద

“సమర్థత, సౌశీల్యం ఎక్కడికైనా చొచ్చుకు పోగలవు” —లార్డ్ చెస్టర్ ఫీల్డ్

శాతం మందికి గంజాయి సిగరెట్లు త్రాగే దురభ్యాసం ఉన్నట్లు తేలింది. ప్రశ్నించిన స్కూలు విద్యార్థులలో దాదాపు సగం మంది తమకు ఆ అలవాటు ఉన్నట్లు చెప్పుతున్నారు.

* * *

## ఇండియాలో యురేనియం నిలువలు:

ఇండియాలో దాదాపు 60,000 టన్నుల యురేనియం నిలువలు ఉన్నట్లు అంచనా!

* * *

## ఇండియాలో ఎలుకల జనాభా:

నిపుణుల అంచనాల ప్రకారం ఇండియాలో 480 కోట్ల ఎలుకలు ఉన్నాయి. అంటే — ఇండియాలోని మనుష్యుల జనాభా కంటె 8 రెట్లు ఎక్కువ అన్న మాట!

* * *

## ఇండియాలో వంటచెరకు వినియోగం:

ప్రస్తుతం ఇండియాలో వినియోగించబడుతున్న వంటచెరకు సుమారు 16.5 కోట్ల టన్నులు. క్రీ.శ. 2,000 వ సం.రం నాటికి ఇది 22.5 కోట్ల టన్నులకు పెరుగగల దని అనుకుంటున్నారు.

* * *

## మిక్కిలి ఎక్కువ జనాభా ఉన్న దేశం:

95.7 కోట్ల జనాభా ఉన్న కమ్యూనిస్టు చైనాయే ప్రపంచంలో జనాభా మిక్కిలి ఎక్కువగా ఉన్న దేశం. 68.4 కోట్ల జనాభాగల ఇండియా ఈ విషయంలో రెండోది. రష్యా, అమెరికాలలో జనాభా వరుసగా— 26.7 కోట్లు, 22 కోట్లు. ప్రపంచ జనాభాలో సగంమంది ఈ నాలుగు దేశాలలోనే ఉన్నారు.

* * *

## ఇండియాలో బొగ్గు నిలువలు:

తలసరి బొగ్గు నిలువలు కమ్యూనిస్టు చైనాలో 1,170 టన్నులూ అమెరికాలో

(మిగతా 20 వ పేజీలో)

## మిక్కిలి ఎత్తైన నాగజెముడు




అరిజోనా, న్యూ మెక్సికో, కాలిఫోర్నియా, మెక్సికోలలో కనిపించే 'సిగ్వారో', అనే నాగజెముడు రకాలు ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా ఎదిగే రకాలు. 1950 లో న్యూ మెక్సికోలోని మద్రోనాలో మిక్కిలి ఎత్తైన మొక్క 53 అ.ల ఎత్తు పెరిగింది. ఈ రకాల మొక్కలకు కాసే ఎర్రని పళ్ళు ఎడారులలో బాటసారులకు ఆహారంగా ఉపయోగిస్తాయి.

"గొప్ప గుణాలు ఉండగానే సరికాదు: వాటిని వాడుకోడం తెలియాలి!" —లా చె ఫొకాల్డ్

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 15

## అవయవ రచన

మానవ శరీరంలోని అవయవాల రచననూ. వాటి విధులనూ గూర్చిన శాస్త్ర భాగాన్ని 'అ నా ట మీ' (అవయవ రచనా శాస్త్రం) అంటారు. చిత్రాలు సహజంగా ఉండాలంటే చిత్రకారుడికి అనాటమీ తెలియాలి. కార్టూనిస్టులు అవయవాల పరిమాణంలోనూ, రూపంలోనూ కొంత అతిశయోక్తిని ప్రదర్శించే మాట నిజమే అయినా, కొన్ని సాధారణ సూత్రాలను వారు విధిగా పాటించాలి. అందుకని — 'అ నా ట మీ' లోని ప్రాథమిక సూత్రాలు తెలుసుకోడం అవసరం.



అస్థిపంజరంలోని ఎముకల రచనా విన్యాసాన్ని గురించీ, ప్రధానమైన కీళ్ళను గురించీ, ప్రధానమైన కండరాలనూ, పనిచేసేటప్పుడు వాటిలో ఏర్పడే మార్పులనూ గురించీ, చర్మాన్నీ, దానిలో కొవ్వు పేరుకునే ప్రాంతాలనూ గురించీ ముఖ్యంగా తెలియాలి. మెదడు, గుండె, ఊపిరి తిత్తులు, నాడీ మండలం లాంటి భాగాల వివరాలు మనకు అనవసరం.

సహజమైన శరీర లక్షణాలలో అతిశయోక్తి ప్రదర్శిస్తూ ఒక బిచ్చగాణ్ణి కేవలం చర్మం కప్పి ఉన్న అస్థిపంజరంగా గీయవచ్చు. అలాగే బరువులు ఎత్తే పహిల్వాన్ కండరాలలో అతిశయోక్తి ప్రదర్శించ వచ్చు. ఒక బోండాం లాంటి వ్యక్తిలో కొవ్వుతో లావుగా బలిసిన భాగాలలో అతిశయోక్తి చూపించ వచ్చు. అనాటమీ

---

### నౌకా వాణిజ్యంలో ఇండియా స్థానం

ప్రపంచంలో నౌకా వాణిజ్యం చేసే దేశాలలో ఇండియా 15వ స్థానంలో ఉంది. అయితే ఓడల టన్నేజి దృష్ట్యా ప్రపం ఇండియా వాటా 1.41 శాతం మా

"పనీ, నమ్మకం, ప్రేమా, గౌరవం
పొందే హక్కు ప్రతి మనిషికీ ఉంది!" —ఎమర్సన్

కిలియతం వల్ల శరీరంలోని కొన్ని ప్రత్యే కావయవాలలో అతిశయోక్తి ప్రదర్శించడం ఎలాగో తెలుస్తుంది.

ఒక విధంగా అస్థిపంజరం దేహానికి పత్రం లాంటిది. ఆ అస్థిపంజరం కదలడానికి తోడ్పడేవి కండరాలు. పుర్రె, వెన్నెముక, రొమ్ము పంజరం, తుంటి ఎముకలు, చేతి ఎముకలు, కాలి ఎముకలు, కీళ్ళు ఎక్కడెక్కడ ఉండేదీ అనాటమీ వల్ల తెలికగా గుర్తించవచ్చు. పురుషులలో భుజం ఎముకలు స్త్రీలలో కంటె వెడల్పుగా ఉంటా యని తెలుసుకోవచ్చు. దేహంలో చలనా లన్నీ ఎముకల మధ్య ఉండే కీళ్ళవల్లనే కలుగుతా యని బోధపడుతుంది. దేహంలో కొన్ని కొన్ని కీళ్ళు కొన్ని కొన్ని ప్రత్యేకమైన కదలికలకే ఉపయోగపడడం కూడా గమనించ వచ్చు. దేహాన్నీ, లేదా కాళ్ళనీ, చేతులనూ కీళ్ళు లేని స్థలంలో వంగి ఉన్నట్టు గీయ కూడదు. (సశేషం)

(18 వ పేజీ తరువాయి)

13,500 టన్నులూ, రష్యాలో 22,000 టన్నులూ ఉంటే, ఇండియాలో 125 టన్నులు మాత్రమే.

• • •

## సాహిత్యంలో ఆడపిల్లల ముందంజ:

ఫ్రాన్స్, ఇంగ్లండు, డెన్మార్క్, స్విట్జర్లాండ్‌లలో మగ పిల్లలలో 62 శాతం సైన్స్ అధ్యయనం చేస్తూ ఉండగా, ఆడ పిల్లలలో దాదాపు 78 శాతం సాహిత్యంలో స్పెషలైజ్ చేస్తున్నారు.

• • •

## నీటి ద్వారా వ్యాపించే వ్యాధులు:

వర్ధమాన దేశాలలో వచ్చే జబ్బులలో సుమారు 80 శాతం త్రాగే నీరు శుభ్రంగా లేకపోవడం వల్ల వస్తున్నాయి. వీటిద్వారా వ్యాపించే వ్యాధులవల్ల ఏటేటా ఇంచుమించు 1.5 కోట్ల మంది పిల్లలు మరణిస్తున్నారు. ప్రపంచంలోని ఆసుపత్రులలో 50 శాతం పడకలలో అలాంటి రోగులనే కనిపిస్తారు. ■

## ఔషధంగా పట్టు పురుగు



కనీసం 8 వ్యాధులకు ఔషధంగా పట్టు పురుగు ఉపయోగపడగల దని మైసూరులోని పట్టు పరిశ్రమ పరిశోధన కేంద్రం డిప్యూటీ డైరెక్టరు శ్రీ బసవన్న అంటున్నారు. పట్టు కాయ రూపొందే తొలి 3 దశలలోనూ పట్టు పురుగు విడిచే మలాన్ని సారాలో కరగించి, ఆ ఔషధం సేవిస్తే రక్తపుపోటు తగ్గుతుంది. పట్టు కాయలు నానబెట్టిన వేడినీరు ఒక గ్లాసెడు తాగితే జలుబూ, దగ్గూ తగ్గుతాయి. పట్టు పురుగు గుడ్డుమంచి పరిణమించే 'ప్యూపా'లో కనీసం 6 అమీనో ఆసిడ్‌లు ఉన్నాయట.

"పేరులోన ఏమి పెన్నిధి ఉన్నది?" —షేక్స్‌పియర్

# సిగరెట్టు వల్ల ప్రమాదాలు

డా॥ ఎస్. సత్యనారాయణమూర్తి

సిగరెట్టు పరిశ్రమ ప్రపంచా న్నంతటినీ ఒక పెద్ద 'ధూమ మందిరం' (Smoking chambers) గా మార్చివేస్తూ, భారీ ఎత్తున కొనసాగిస్తున్న హత్యాకాండ పట్ల ఆందోళన



ప్రకటిస్తూ, ప్రపంచ ఆరోగ్య సంస్థవారు ప్రపంచంలోని వివిధ దేశాల ప్రభుత్వాలను 'ఈ మహమ్మారిని అరికట్టేందుకు తీవ్రమైన చర్యలు తీసుకోవలసిం'దని హెచ్చరించారు. పర్యవసానంగా వివిధ దేశాల ప్రభుత్వాలు సిగరెట్టు పరిశ్రమవారు చేసే ప్రకటనలలో 'సిగరెట్లు ఆరోగ్యానికి హానికరమైనవి' అనే వాక్యం చేర్చాలని శాసించాయి. అంతటితో తమ బాధ్యత తీరిపోయినట్టు విశ్రాంతగా కాలం గడుపుతున్నాయి.

వీధిలో వెళుతూ ఉంటే వేర్వేరు బ్రాండ్ల సిగరెట్ల శాలూకు అద్భుతమైన సువాసనని గురించీ, రుచిని గురించీ, ప్రేమకలాపాలలో అవి చెయ్యగల సహాయాన్ని గురించీ పెద్ద పెద్ద అక్షరాలలో ఆకర్షకమైన ప్రకటనలు మనకు కనిపిస్తాయి. ఎక్కడో ఒక మూలగా చిన్న అక్షరాలలో ఉన్న 'సిగరెట్లు ఆరోగ్యానికి హానికరం' అనే వాక్యం వెలా తెలవోతూ ఉంటుంది.

ప్రపంచంలో సిగరెట్ల ఉత్పత్తి నానాటికీ దారుణంగా పెరిగిపోతూంది. స్వరాజ్యం వచ్చిన తర్వాత ఇండియాలో సిగరెట్ల ఉత్పత్తి 2,145 కోట్ల నుంచి 12,000 కోట్లకు పెరిగింది. అయినా - ఏ ప్రభుత్వమూ తనకు ఎక్కువెక్కువగా ఎక్సైజు పన్ను

## తొలి వార్తా ప్రసారక కేంద్రం

ఛార్లెస్ హవాస్ అనే ఫ్రెంచ్ జాతీయుడు 1832 లో తొలి వార్తా ప్రసారక సంస్థ స్థాపించాడు. వివిధ కేంద్రాల నుంచి వార్తల సేకరణకు ఆయన పావురాలను ఉపయోగించాడు. 1848 లో న్యూయార్క్ నగరంలోని 6 వార్తా పత్రికల వారు కలిసి 'ది అసోషియేటెడ్ ప్రెస్'ను స్థాపించారు. అప్పుడే క్రొత్తగా కనిపెట్టిన టెలిగ్రాఫ్ ద్వారా వార్తల సేకరణకూ, ప్రసారానికీ అయే ఖర్చును వారు సమానంగా భరించారు.

"దూరంగా ఉన్న సమస్యల విషయం మనం పట్టించుకోకపోతే,
అవే దగ్గరై మన భరతం పడతాయి!" —కన్ఫ్యూషియస్

సమకూరుస్తున్న సిగరెట్టు పరిశ్రమను అదుపులో పెట్టడానికి ఆసక్తి చూపించడం లేదు.

కొత్తగా సిగరెట్టు తాగడం మొదలుపెట్టే వారిలో ఎక్కువమంది 20 ఏళ్ళ లోపువాళ్ళే! 'పొగాకు మహమ్మారి'ని శ్రద్ధగా సేవించే భక్తులలో రాజకీయవేత్తలు మొదలు, శ్రమజీవుల దాకా, నగరవాసులు మొదలు గ్రామీణుల దాకా అన్ని వర్గాలవారూ ఉన్నారు. మనిషి చాలా తెలివిగలవాడు. పొగ త్రాగడం మత విరుద్ధం అని ప్రకటిస్తే పొగాకును మరో రూపంలో - తంబాకు రూపంలోనో, నస్యం రూపంలోనో - సేవించడం మొదలు పెట్టాడు. వీటిని మతం నిషేధించదు. పైపెచ్చు సభలలో, సమావేశాలలో వీటిని ఇవ్వకపోతే తమ గౌరవానికి లోపం అనేటంతవరకూ కూడా వచ్చింది.

ఇటీవలి కాలంలో వాతావరణ కాలుష్య సమస్య విషయమై రాజకీయవేత్తలూ, మేధావులూ, ఆరోగ్య శాస్త్ర నిపుణులూ ఆందోళన చెందుతున్నారు. వాతావరణ కాలుష్యం నుంచి మానవ జాతిని కాపాడేందుకు మార్గాలు అన్వేషించడానికి ఎన్నో కమిటీలు వేశారు. అయితే - బస్సులోనో, హోటల్‌లోనో మీ ప్రక్కన కూచుని మీ ఇష్టా నిష్టాలను గాని, 'పొగ త్రాగడం నిషిద్ధం' అన్న ప్రకటనను



గాని ఎంత మాత్రం ఖాతరు చెయ్యకుండా దర్జాగా ఓ బీడియో, సిగరెట్టో వెలిగించే పెద్దమనిషిని చూడండి. ఆ పొగలోని 'నికోటిన్'లో అతని ఊపిరితిత్తులలోకి పోయేది 10 శాతం మాత్రమే! 90 శాతం పక్కన కూచున్న మీ బోటివారి మీదికి వదిలి తనకంటె కూడా మీకే ఎక్కువ హాని కలిగిస్తున్నాడు. ఊపిరితిత్తులలో కేన్సరు వ్యాధితో బాధపడే స్త్రీ రోగులలో చాలామంది భర్తలు గొలుసు కట్టుగా సిగరెట్లు కాల్చే అలవాటు ఉన్న వారు అని పరిశీలనవల్ల తేలింది. గొట్టాల ద్వారా పొగ వదిలే ఫ్యాక్టరీలు కనీసం దేశ ఆర్థిక సంపదనైనా పెంపొంది

## పైన పటారం, లోన లొటారం

200 ఏళ్ళ చరిత్ర మాత్రమే ఉన్న అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రపంచంలో జాతీయాదాయం మిక్కిలి ఎక్కువగా ఉన్న దేశం. అయితే - అమెరికన్ వార్తా పత్రికల కథనం ప్రకారమే అక్కడి వయోజనులలో ప్రతి 5 గురిలో ఒకరు నిరక్షరాస్యులు. అంటే - అతడు/ఆమె ఉత్తరం వ్రాయడం గాని, హోటలులో 'మెనూ' చదవడం గాని చేయలేరు. 24 లక్షల మంది పిల్లలకు అక్కడ బడికి వెళ్ళే అవకాశం లేదు.

"దర్శన శాస్త్రానికి సరియైన నిర్వచనం:
'వివేకం పట్ల అనురాగం'" —సిసిరో

స్తున్నాయి. కాని ఈ 'పొగ తాగే' ఇండస్ట్రీ తనని నమ్ముకున్న భక్తుల నెత్తిమీదే చెయి పెడుతూంది.

పొగ త్రాగడంవల్ల డజన్ల కొద్దీ జబ్బులు సంక్రమించగలవని గుర్తించారు. నిదానంగా ప్రాణాలు తీసే విషం పుగాకు. దీనివల్ల ఉబ్బసం, బ్రోంకైటిస్, గుండె జబ్బులు, ఊపిరితిత్తులలోనూ, నోట్లోనూ కేన్సరు, క్షయ, పక్షవాతం, గాస్ట్రిక్ అల్సర్, లివరు జబ్బులూ, వాత వ్యాధులూ, పళ్ళ జబ్బులూ లాంటివి వస్తాయి. వ్యాధి నిరోధక శక్తి క్షీణిస్తుంది. ఒక చిత్రమైన అంధత్వం, చివరికి ఒక రకం ఉన్మాదం కూడా కలుగవచ్చు!



పొగ, పొడుం పీల్చడంవల్ల గాఢంగా శ్వాస పీల్చే శక్తి సన్నగిల్లుతుంది. ఊపిరితిత్తులలోని సున్నితమైన ధాతువులమీద నికోటిన్, కార్బన్ మోనాక్సైడ్ వంటి పదార్థాలు పేరుకుంటాయి. రక్తప్రసారంలోని 'ప్లేట్‌లెట్'లు జిగటగా తయారై, రక్తనాళాలు సన్నగిల్లడం, రక్తం చిక్కబడడం జరుగుతుంది: ఫలితంగా రక్తపు పోటూ గుండెజబ్బులూ వస్తాయి.

పొగ త్రాగడంవల్ల స్త్రీ, పురుషులు యిలలోనూ సంతానోత్పాదక శక్తి తగ్గుతుందని వైద్య పరిశోధనలు స్పష్టం చేశాయి. గర్భవతిగా ఉన్నప్పుడు పొగ త్రాగితే అది గర్భస్రావాలకు దారితీయవచ్చు. పుట్టబోయే శిశువుల మెదడూ, క్రోమోజోములూ దెబ్బ తినవచ్చు. జీన్‌ల మీదా, అనువంశిక లక్షణాల మీదా కూడా నికోటైన్ ప్రభావం ఎక్కువగ కనిపిస్తూంది. పొగత్రాగేవారి బిడ్డలు తేలికగ ఈ అలవాటుకు దాసు లవుతున్నారు.

## పాఠకుల అభిప్రాయాలు

(డిసెంబరు 1982)

"మానవత్వము మంట గలిసె
దానవత్వము మింటి కెగసె!"

—ఎన్. లక్ష్మీ నారాయణ చౌదరి
మాల్యవంతం (అనంతపూరు జిల్లా)

* * *

"పత్రికా స్వేచ్ఛకు పడితే సంకెళ్ళు
భరత మాతకు మిగిలేవి కన్నీళ్ళు!"

—కె.వి.ఎల్. నరసింహశాస్త్రి
విజయవాడ

* * *

"ఎన్నికల మాటేమోగాని బాబూ!
గోడ లన్నీ ఖరాబు!

—వై. రాజా బాలసత్యమూర్తి
మామిడి కుదురు (తూ.గో. జిల్లా)

"పదవి కోసం రాజకీయవేత్త ఏమైనా చేస్తాడు:
చివరికి 'దేశభక్తుడు' కూడా అవుతాడు!"—విలియం రాండోల్ఫ్ హిర్స్ట్

కేవలం శాసనాలవల్లనే ఈ సమస్య పరిష్కారం కాదని అనుభవం చెబుతూంది. అయినా సినిమా హాలుల వాళ్ళు, వార్తా పత్రికలూ సిగరెట్టు మొదలైన వాటి ప్రకటనలు నిరాకరించే పక్షంలో పరిస్థితి కొంత మెరుగుపడవచ్చును. ప్రభుత్వాలూ, మునిసిపాలిటీలూ గట్టిగా పూనుకుంటే గోడలమీదా, వీధులలోనూ ఆకర్షకమైన సిగరెట్ అడ్వర్టైజ్‌మెంట్లు కంటబడకుండా చెయ్యవచ్చును.

పొగ త్రాగడం ఒక అలవాటే తప్ప, అవసరం కాదు. దీనివల్ల కలిగే అనర్థాలను పూర్తిగా గుర్తించిన నాడే ఈ దురాచారం నుంచి బయటపడే యత్నం సఫలం అవుతుంది. పొగ త్రాగనివారు సంఘాలుగా ఏర్పడడం కొంత తోడ్పడవచ్చు. కాల్చే సిగరెట్ల సంఖ్య క్రమంగా తగ్గిస్తూ ఈ అలవాటును మానాలని చూడడంవల్ల లాభంలేదు. ఒక్కసారి దృఢంగా తీర్మానించుకొని మానివేయాలి. సిగరెట్టు ముట్టించకపోతే విరేచనం కాదు అనే మాట వట్టి అపోహ. పళ్ళు, కూరగాయలూ ఎక్కువ తినడంవల్ల అ చిక్కును పరిష్కరించుకోవచ్చును. ప్రతి ఉదయం 20 ని.ల పాటు ప్రాణాయామం చేయడం, శవాసనం వేయడం చాలా మేలు చేస్తాయి.

పశువులు కూడా పొగాకు చేలలో గడ్డి మెయ్యడానికి వెనుకాడతాయి. కాని విచక్షణ, వివేకం ఉన్న మనిషి మాత్రం మనస్సును మళ్ళించుకోలేక ఈ దారుణ దురాచారానికి దాసుడవుతూ ఉండడం నిజంగా శోచనీయం. తను కాల్చే ప్రతి సిగరెట్టూ తన శవపేటిక మీద బిగించే ఒక్కొక్క మేకు అని అతడు ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది! ●

## "ఎలాంటి అవకాశం ఇవ్వద్దు!"

ఒక లాయరు తన క్లయింట్‌కి టెలిగ్రాం పంపాడు: "మీ అత్తగారు గతరాత్రి నిద్రలో చనిపోయారు. ఖననమా, దహనమా - ఏది ఏర్పాటు చెయ్యమంటారు?" వెంటనే క్లయింట్ ఇచ్చిన టెలిగ్రాం: "ఎలాంటి అవకాశం ఇవ్వద్దు - రెండూ ఏర్పాటు చెయ్యండి!"

## "మీకు కొత్త జీవితం ఇస్తాను!"



ఒక కోటీశ్వరుడు ఒక రోజున పేపరు చూస్తూ ఉండగా దానిలో 'మరణాల' కాలంలో ఆయన పేరు కనిపించింది. ఆయనకు ఒళ్ళు మండిపోయింది వెంటనే పత్రికాఫీసుకి వెళ్ళి ఎడిటర్‌ని బెదిరించాడు. ఆయన కేసుని జవాబు చెప్పాలి అని నిదానంగా ఆలోచించి ఎడిటర్ ఇలా అన్నాడు: "రేపు 'జననాల' కాలంలో మీ పేరు వేసి, మీకు కొత్త జీవితం ఇస్తాను-సరా?"

"మర్యాదగా మాట్లాడు; గడుసుగా వ్రాయి;
యుద్ధంలో కూడా కొన్ని మర్యాదలు పాటించాలి!" —బిస్మార్క్

# ఔషధ ప్రపంచం

## రక్తపరీక్షకు నూతన విధానం:

పశ్చిమ జర్మనీలో గార్చింగ్‌లోని 'మాక్స్ ప్లాంక్ ప్లాస్మా ఫిజిక్స్ ఇన్‌స్టిట్యూట్'కి చెందిన శాస్త్రవేత్త డా. విల్స్ కైజర్ రక్తాన్ని పరీక్షించడానికి ఒక నూతన విధానం కనిపెట్టారు. మైక్రో తరంగాలను ఉపయోగించే ఈ పద్ధతి వల్ల సూది గుచ్చి రక్తం తీయవలసిన అవసరం లేకుండా, అతి వేగంగా రక్తంలో ఉన్న ఆల్కహాలు, చక్కెర, కొవ్వు, యూరియా మొదలైన పదార్థాల నిష్పత్తిని గుర్తించవచ్చును.

* * *

## గర్భవతులారా! ఆస్పిరిన్ వాడకండి:

టొరాంటో (కెనడా)లోని పిల్లల ఆసుపత్రిలో 'పీడియాట్రిక్ కార్డియాలజీ' విభాగం డైరెక్టరు డా. రిచర్డ్ రోవె స్త్రీలు గర్భవతులుగా ఉన్నప్పుడు ఆస్పిరిన్ సేవిస్తే రక్తంలో ప్రాణవాయువు కొరత ఏర్పడిన 'నీలి పిల్లలు' (blue babies) పుట్టవచ్చునని హెచ్చరిస్తున్నారు.

* * *

## శ్వాసకోశంలో వింత రసాయన పదార్థం:

ఉబ్బసం జబ్బుతో బాధపడే రోగులకు ఆయాసం కలిగించే శ్వాసకోశంలోని ఒక వింత రసాయన పదార్థాన్ని గుర్తించడానికి లండన్‌లోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బేసిక్ మెడికల్ సైన్సెస్' సంస్థ తాలూకు శాస్త్ర

---

## ఏక బిగిని 3,000 కి.మీ. లు పయనించే పక్షి



సముద్ర తీరంలో కనిపించే 'గోల్డెన్ ప్లోవర్' అనే పక్షి ఈశాన్య ఏషియాలోని బేరింగ్ సముద్ర ప్రాంతం నుంచి ప్రతి శీతాకాలం ఇండియాకు వలస వస్తుంది. 3,000 కి.మీ. ల దూరం ఏకబిగిని ఎక్కడా ఆగకుండా సముద్రం మీద ఇది పయనిస్తుంది. నిద్రాహారాలు లేకుండా 50, 60 గంటలసేపు అదేపనిగా ఎగిరి అది ఈ ప్రయాణాన్ని పూర్తి చేస్తుంది.

---

"ప్రధానమైన ప్రకృతి సూత్రం శాంతిని అన్వేషించడం!" —హాబ్స్

వే త్తల బృందం గట్టి కృషి చేశారు. తత్ఫలితంగా 'అనాఫైలాక్సిస్' (anaphylaxis) అనే ఒక రసాయన పదార్థాన్ని వారు వేరు చేయగలిగారు.

* * *

## ఆపరేషన్‌లలో వాడే 'చల్లని ఊచ' లు:

కేన్సర్ ఆపరేషన్‌లలో వాడడం కోసం న్యూఢిల్లీలోని 'ది నేషనల్ ఫిజికల్' లేబొరేటరీలో 'చల్లని ఊచ' (cryo probes) లను కనిపెట్టారు. ఈ ఊచల చివర ఉష్ణోగ్రత '—80°' సెంటీగ్రేడ్ ఉంటుంది. కేన్సర్ వల్ల నిర్జీవమైన ధాతువులు దానికి అంటుకోడం వల్ల తేలికగా వాటిని తొలగించడం సాధ్యం అవుతుంది. కంటి శుక్లాలు, 'గ్లాకోమా' (నేత్రవ్యాధి), టాన్సిల్స్, మెదడు ఆపరేషన్‌లలో కూడా ఈ 'చల్లని ఊచ' లను వాడుక చేయవచ్చును.

## ఉబ్బసానికి మందు

ఉబ్బసానికి ప్రస్తుతం వాడుతున్న మందులలో ముఖ్యమైంది 'ఎఫిడ్రైన్'. ఇది ప్రధానంగా 'ఎఫిడ్రా' అనే మొక్క నుంచి తయారవుతుంది. 5,000 ఏళ్ళ క్రితమే ఈ ఓషధి చైనా వారికి తెలుసు. చాలా ఆలస్యంగా ఇది ఇండియాకు వచ్చింది. ప్రస్తుతం శ్వాసకోశ వ్యాధులకూ, కొన్ని నేత్ర వ్యాధులకూ, గుండె ఆగిపోతే దానికి తిరిగి ప్రేరణ కలిగించేందుకూ దీనిని ఎక్కువగా వాడుతున్నారు.

## గర్భనిరోధానికి సులభోపాయం:

కాన్పుల మధ్య ఎక్కువ ఎడం ఉండేట్టు చూసుకోడానికి బరోడా (గుజరాత్) లోని ఎస్.ఎస్.జి. హాస్పిటల్‌లో పటిష్ఠమైన ఒక నూతన గర్భనిరోధక ప్రక్రియ కనిపెట్టారు. ఋతుమతి అయిన 5 రోజుల లోగా ఒక హార్మోన్ల ఇంజెక్షన్ ఇస్తే తరువాత 2 నెలలు ఆ స్త్రీకి గర్భం రాదు. రెండేసి నెలలకొకసారి అలా ఇంజెక్షన్‌లు తీసుకోవాలి. ఇంజెక్షన్‌లు ఆపిన వెంటనే మామూలుగా ఆమె గర్భవతి అవుతుంది. ●

---

## అదృష్ట పాఠకుడు

(డిసెంబరు 1982)



అంచూరి రాజేంద్ర ప్రసాద్, ఎమ్.ఎస్.సి. (అప్లైడ్ స్టాటిస్టిక్స్) విద్యార్థి, రూము నెం. 34, బి - హాస్టల్, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాదు. హాబీలు: కథలు వ్రాయడం, కార్టూన్‌లు గీయడం, స్టాంపుల సేకరణ.

"పిడికిలి బిగించి ఉన్న మనిషి స్పష్టంగా ఆలోచించ లేడు!" —జార్జ్ జీన్ నాథన్

# తాత్సారం వల్ల నష్టాలు

ఎం. జె. పటేల్, జంషెడ్‌పూర్



నిర్ణయాలు వాయిదా వేస్తూ తాత్సారం చేస్తూ ఉండడం ప్రపంచంలో చాలామందికి సరదా! వ్యాపారంలో, ప్రభుత్వ కార్యాలయాల్లో, రాజకీయాలలో ఎప్పటి కప్పుడు అతి నేర్పుగా నిర్ణయాలు వాయిదా వేస్తూ ఉండే ఘను లెందరో మనకు కనిపిస్తారు. పని చెయ్యడానికి కాక, చెయ్యక పోవడానికి ఎప్పుడూ ఏవో సాకులు అన్వేషించడానికే అలవాటు పడడంవల్ల చాలామంది విషయంలో వారు ఒక మంచి కార్యాన్ని ఆరంభించడమే జరుగదు.

పని చెయ్యనందుకు సాకులు చెప్పడం తేలికే! కాని, అది చాలా ప్రమాదంతో కూడిన అలవాటు; ప్రయత్నించనైనా ప్రయత్నించకుండానే పనికి స్వస్తి చెప్పే అలవాటు. దానివల్ల క్రమంగా ఆత్మవిశ్వాసం దెబ్బ తింటుంది. రోజూ మనకు ఎదు రయ్యే అవకాశాల విషయంలో ఇలా అపసవ్యంగా ఆలోచించడం వల్ల జీవితంలో మనం ఎక్కువగా సాధించలేకపోవడం జరుగుతుంది.

సాధారణంగా అందరూ చెప్పే ఒక కుంటి సాకు—"పని చెయ్యడానికి కావలసిన పరికరాలు నా దగ్గిర లేవు" అని. కాని, డా॥ సి.వి. రామన్ తన 'రామన్ ఎఫెక్ట్' ను

---

## మీా రైతే?

(డిసెంబరు 1982)

"కలలో అయితే చంపేస్తా!
—ఎస్. అనిల్ కుమార్, హైదరాబాద్.

* * *

"ప్రతి పక్షాల కుట్ర అని
పేపరులో ప్రకటిస్తాను!"
—కోపూరి రవికుమార్, తెనాలి-2.

* * *

"గుండెల్లో కుంపటి భరించే నాకు
పక్కలో పామొక లెక్కా?"
—సూరం మీనాక్షమ్మ, నెల్లూరు-2.

---

"ఎవరికీ కొత్తగా ఏదీ బోధించలేము;
తమకు తాము గుర్తించేట్లు మాత్రమే చేయగలం." —గెలిలీయో

తుజావు చెయ్యడానికి కేవలం రూ. 200 లు ఖర్చుతోనే ఒక కొత్త పరికరం తయారు చెయ్యగలిగారు. 'క్యూరీస్' రేడియమ్‌ని వేరు చేయడం కనిపెట్టింది-ఇప్పుడో ఇంకాసేపటికో కూలిపోడానికి సిద్ధంగా ఉన్న ఒక చిన్న షెడ్‌లో - అని మనం మరచి పోకూడదు.



డా॥ సి. వి. రామన్

ప్రజలు చెప్పే మరో సాకు - "అందరూ నన్ను పని చెయ్యకుండా అవరోధాలు కలిగిస్తున్నారు" అని. డా॥ హర్ గోబింద్ ఖురానా ఇలాంటి సాకులు చెబుతూ కూర్చుని ఉంటే ఆయన సాధించిన నూతన సిద్ధాంతం సాధ్యం అయేది కాదు.

పని చెయ్యడానికి ఏకాగ్రత అవసరం. కొంత విరిగి మీద పడా కొందరు తాము ఎంచుకున్న లక్ష్యం నుంచి తమ దృష్టి మళ్ళించరు. ఇతరులు అవరోధాలు కలిపిస్తున్నారు అంటూ అలాంటి వారు చేతులు ముడుచుకు కూర్చోరు.

"అబ్బో!అది నాకు తలకు మించిన పని" అని మరికొందరు వెనుకంజ వేస్తూ ఉంటారు. అదీ అనవసప్రు ఆలోచనే!

"నేను కాకుండా మరొకళ్ళు చేస్తే ఈ పని ఇంకా బాగా చెయ్యగలరు" అంటూ మరి కొందరు తమ శక్తిని కాకుండా, తమ ఔదార్యాన్ని ప్రకటించడానికి ప్రయత్నిస్తారు.

"నాకు చదవడానికి తీరిక ఎక్కడుంటుంది!" అనే వారు తాము ఉన్న స్థితితో తృప్తిపడి, అంతకంటె ఉన్నతంగా ఎదగడానికి నిరాకరించేవారు.

సజీవమైన వ్యక్తి శక్తి వంచన లేకుండా రోజూ ఏదో ఒక కొత్తపని చేస్తూ ఉంటాడు. "నేను సాధించగలిగిం దంతా 'నిన్న'నే సాధించాను" అనుకునే వాడు 'నేడు' జీవించడం లేదు. ●

## మానవ కల్పితమైన మిక్కిలి పెద్ద సరస్సు

ఇంగ్లండ్‌లో ఇటీవల నిర్మాణం పూర్తి అయిన ఒక డామ్ వల్ల ప్రపంచంలో మిక్కిలి పెద్ద సరస్సు రూపొందింది. 'కీల్డర్ వాటర్' అనబడే ఈ రిజర్వాయర్‌లో 20 వేల కోట్ల లీటర్ల నీరు నిలువ ఉంటుంది. 1,050 హెక్టేర్ల విస్తీర్ణం గల ఈ సరస్సు రెండేళ్ళలోగాని పూర్తిగా భర్తీ కాదు. ఇంగ్లండులోని పెద్ద నదులలో ఒకటైన టైన్ నది కడ్డంగా 40 లక్షల ఘ.అ.ల మట్టితో నిర్మించబడిన ఈ డామ్‌కి 12.8 కోట్ల పౌనులు ఖర్చయింది.

"గొప్పవాళ్ళలోని లోపాలు మూర్ఖులకు ఓదార్పు!" —ఇజాక్ డిస్రేలీ

# యోగాసనాలు

వ్యాయామవిద్యాప్రవీణ శ్రీ జి. శ్రీనివాసరావు

2. భుజంగాసనం :



BHUJANGASANA

నేలకు నుదురు తగిలేట్టు నేలమీద బోర్ల పడుకోవాలి. అర చేతులను రొమ్ము కిరు ప్రక్కల నేల మీద ఉంచాలి. అప్పుడు పాము పైకి లేచి పడగ విప్పే విధంగా మెల్లగా తలనూ, మొండేన్ని పైకి లేపాలి.

వ్యవధి : 1/6 ని.ల నుంచి 2 ని.లు.

ప్రయోజనాలు : రొమ్ము విప్పారి, ఊపిరి తిత్తులు విశాలమై ఎక్కువగా గాలి పీల్చడానికి వీలవుతుంది. జీవశక్తి వృద్ధి చెంది, ఇంద్రియ నష్ట వ్యాధి నివారణ అవుతుంది. నడుము, మెడ, పొత్తి కడుపు ప్రాంతాలలో కండరాలకు పుష్టి ఏర్పడుతుంది. స్త్రీలకు ఈ ఆసనం చాలా మంచిది. వారి గర్భాశయాన్నీ, అండకోశాన్నీ (ovaries) ఆరోగ్యంగా ఉంచుతుంది. పని వత్తిడి వల్ల కలిగే వెన్ను నొప్పిని ఈ ఆసనం పోగొడుతుంది.

3. శలభాసనం :



SALABHASANA

గడ్డం నేల మీద ఆనేలాగ బోర్ల పడుకోవాలి. పిడికిళ్ళు బిగించిన చేతులను శరీరం ప్రక్కగా నేల మీద ఉంచాలి. గట్టిగా గాలి పీల్చి, ఊపిరి బిగబట్టాలి. తరువాత మెల్లగా కాళ్ళనూ, బొడ్డువరకూ నడుమునూ పైకెత్తాలి.

వ్యవధి : 10 సెకన్లు.

ప్రయోజనాలు : గుండె, పిత్తకోశం (spleen), కడుపు, పొత్తి కడుపు, మూత్రకోశం, చిన్నప్రేగులు మొదలైన భాగాలకు ఈ ఆసనం మేలు చేస్తుంది. ఊపిరి బిగబట్టడం (కుంభకం వల్ల) ఊపిరి తిత్తులు బలపడుతాయి. (సశేషం)

---

"తొందర, తీవ్రత మనకు భద్రత లేకుండా చేస్తాయి!" — డెన్ హామ్

## బహుమతి పొందిన వ్యాసం

(నవంబరు 1982)

# అంతరిక్ష యాత్రలవల్ల లాభాలు

సి. హెచ్. జయదేవ్, గుంటూరు.

'నిశ్శబ్దం నుంచే శబ్దం ఉద్భవిస్తుంది' అని చెబుతున్నాయి వేదాలు. ఒకప్పుడు మానవుని దృష్టిలో అంతరిక్షం (space) వట్టి శూన్యం; దానిలో మనకు ఉపయోగించేవి ఏవీ లభించవు. కాని, నేటి మానవుని దృష్టిలో అది అంతులేని సంపదలకు నిలయం. దానిని ఎంత మథిస్తే అంత ఎక్కువగా మనం లాభం పొందగలం.

మానవుడీనాడు తుపానులను అరికట్టగలుగుతున్నాడంటే అది అంతరిక్ష పరిశోధనం చలువవల్లనే; తాను నివసించే ప్రదేశం యొక్క స్థితిగతులనూ, వాతావరణాన్నీ ఎప్పటికప్పుడు అతడు తెలుసుకోగలుగుతున్నాడు. మనం నిత్యం ఉపయోగిస్తున్న ఎలక్ట్రానిక్ గడియారాలూ, రోదసీ యాత్రికులు ఉపయోగించే ఆహారం (freezed dried food) కూడా అంతరిక్ష యాత్రల కోసం జరిపిన పరిశోధనల ఫలితాలే; ఈ సంవత్సరం భారతదేశం సాధించిన ఘన విజయాలలో ఒకటి అయిన 'ఇన్‌శాట్' కూడా

### పట్టు పురుగుల ఆత్మ బలి!



26 రోజుల జీవిత కాలంలో పట్టుపురుగు ఎన్నెన్నో ఆకులు తిని సుమారు 1,000 మీటర్ల పట్టుదారం ఉండే ఒక పట్టు కాయను తయారు చేస్తుంది. అందుకు ఫలితంగా పట్టు కాయను వేడి నీళ్ళలో వేసి పట్టు పురుగును హతమారుస్తాం. ఒక అందాల బరిణె శరీరాన్ని అలంకరించే ఒక్క పట్టుచీరకు 300 గ్రాముల పట్టు కావాలి. సుమారు 8,000 పట్టు పురుగుల ఆత్మ బలిదానం వల్లనే ఆ పట్టు లభిస్తోంది.

"తమ తల్లులు మలచిన బొమ్మలు పురుషులు!" —ఎమర్సన్

అంతరిక్ష పరిశోధనం వల్లనే సాధ్యం అయింది.

తుఫానులను అరికట్టడం సంగతీ, వాతావరణాన్ని పసిగట్టే సంగతీ, టెలి కమ్యూనికేషన్‌ల సంగతీ మీలో చాలా మందికి తెలిసి ఉండవచ్చు. కాని, ఇటీవల కెనడాకు చెందిన ఒక అంతరిక్ష పరిశోధన సంస్థవారు రోదసీ యాత్రలవల్ల కలిగే మరొక ముఖ్యమైన ప్రయోజనాన్ని కనుగొన్నారు. ఆకాశంలో ఒక విమానం ప్రయాణిస్తూ ఉండగా అది ఒక 'హరికేన్' లోనో, 'టార్పిడో' లోనో (ఈ రెండూ అతి ప్రచండ వేగంతో వీచే గాలులు) చిక్కుకుంటే దాన్ని రక్షించడానికి అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న కృత్రిమ ఉపగ్రహాల నుంచి ఒక రకమైన విద్యుదయస్కాంత తరంగాలను పంపి ఆ గాలుల వేగాన్ని తగ్గించవచ్చునట! ఈ విషయం ఇంకా ప్రయోగ దశలోనే ఉందనీ, ఇది విజయవంతం కాగలదనే నమ్మకం తమకు ఉందనీ కూడా వారు తెలియజేశారు.

నాణానికి రెండువైపులు ఉన్నట్టు ప్రతి పనిలో మంచీ, చెడూ ఉంటాయి. అంతరిక్షం ద్వారా ఇన్ని ఉపయోగాలు పొందుతున్న మానవుడు మరికొన్నేళ్ళలో అంతరిక్షాన్ని శ్మశాన భూమిగా మార్చడానికి సన్నాహాలు చేస్తూ ఉండడం శోచనీయం!

• • •

ఎమ్. రాంమోహన్, బెల్లంపల్లి.

మానవుడు వినీలాకాశంలో కనిపించే నక్షత్రాలనూ, గ్రహాలనూ గురించి తెలుసుకోవాలని శతాబ్దాలుగా ఉద్యమిస్తూ వచ్చాడు. ఆ ప్రయత్నంలోనే ఆకాశయానాన్ని సాధించాడు.

రోదసీ శకం ప్రారంభమై పాతికేళ్ళు గడిచాయి. 1957 అక్టోబరు 4 న రష్యా ప్రప్రథమంగా కృత్రిమ ఉపగ్రహాన్ని భూమి కక్ష్యలోకి పంపించింది. ఈ ఉపగ్రహాలవల్ల మానవులకు అనేక ప్రయోజనాలు కలుగుతున్నాయి. 1. వాతావరణ పరిశీలక ఉపగ్రహాలు, 2. వార్తా ప్రసారక ఉపగ్రహాలు,

## సముద్రపు నీటిలో లవణాలు



సముద్రపు నీటిలో 96.5 శాతం - హైడ్రోజన్, ఆక్సిజన్‌ల సంయోగం వల్లనే ఏర్పడుతుంది. తక్కిన 3.5 శాతంలోనూ ఉన్న లవణాలలో ముఖ్యంగా 6 మూల పదార్థాలు ఉన్నాయి. అవి: సోడియం, పొటాషియమ్, మెగ్నీషియం, కాల్షియం, క్లోరైన్, సల్ఫైట్. ఇవి కాక - లిథియమ్, రుబిడియమ్, యురేనియం లాంటి అనేక ఇతర మూల పదార్థాలు కూడా చాలా తక్కువ పరిమాణంలో ఉన్నాయి.

"వస్తువులున్నవాడికి దేవుడు కూడా రొట్టె రూపంలో తప్ప మరోలా కనిపించడానికి జంకుతాడు" —గాంధీజీ

3. వైజ్ఞానిక ఉపగ్రహాలు అని అవి చేసే పనులను బట్టి ఉపగ్రహాలను వర్గీకరించ వచ్చును.

భారత దేశం 1980 జూలై 18 న తన తొలి ఉపగ్రహం 'రోహిణి'ని అంతరిక్షం లోకి పంపించింది. ఈ కృత్రిమ ఉపగ్రహాల వలన భూసారం, ఖనిజ సంపద, అటవీ సంపద, ఋతుపవనాల గమనం మొదలైన ఎన్నో విషయాలను తెలుసుకోడానికి వీలవు తుంది. ఇటీవల ఢిల్లీలో జరిగిన ఆసియా క్రీడోత్సవాలను వివిధ ప్రాంతాలలోని జనులు టెలివిజన్‌లో చూడగలిగారంటే అది ఈ ఉపగ్రహాల చలువ వల్లనే!

మానవజాతి చరిత్రలో మహోదయ శకా నికి స్వర్ణ ద్వారాలు తెరుస్తున్న రోదసీ పరి శోధనలు భవిష్యత్తులో మారణ హోమానికి కాకుండా మానవ కళ్యాణానికి వినియోగ పడ గలవని ఆశిద్దాం!

•

బి. హెచ్. ధనవర్మ, విశాఖపట్నం.

నిన్న, మొన్నటి వరకూ చిన్నపిల్లలు ఏడిస్తే ప్రతి తల్లీ చందమామను చూపించి ఆడించేవారు. అలాంటిది ఈనాడు మానవుడు చంద్రమండలం మీద అడుగు పెట్టగలిగా డంటే సైన్సు సాధించిన ప్రగతి విశదం అవుతుంది.

రోదసీ నౌకలను ప్రయోగించడంలో రష్యా, అమెరికాలు పోటీ పడుతున్నాయి. అయితే వీటివల్ల మానవులకు ఎన్నో ఉపయో గాలు ఉన్నాయని శాస్త్రజ్ఞులు ప్రకటిస్తున్నారు. వాటిలో కొన్ని:

1. భూమిచుట్టూ ఉండే వాతావరణ స్వభా వాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకొని వాతావరణ కాలుష్యాన్ని తొలగిస్తూ ఉండవచ్చు.

2. భూమిమీద నుంచి చేయడానికి వీలు లేని అనేక శాస్త్ర పరిశోధనలను అంతరిక్షం లోని కృత్రిమ ఉపగ్రహాల నుంచి జరుప వచ్చును.

3. అంతరిక్షంలో వలసలు నిర్మించుకొని అక్కడ నుంచి శక్తినీ, ముడి సరుకులనూ రాబట్టుకొనవచ్చును.

ఈ విధంగా అంతరిక్ష యాత్రల వల్ల మానవజాతి తన జీవితాన్ని నందనవనంగా మార్చుకోవచ్చును! ●

## బరువు పనులకు మర మనిషి



బరువు పనులు చేసే మర మనుష్యులను (robots) ప. జర్మనీలో ఇప్పుడు భారీ ఎత్తున ఉత్పత్తి చేస్తున్నారు. కాలుతున్న లోహపు కడ్డీలూ, పెద్ద పెద్ద బరువులూ మొద లైన వాటిని ఈ మర మనుషులు చేరవేయ గలరు. ఫౌండరీలలోనూ, దూళిధూసరమైన పరిసరాలలోనూ ముఖ్యంగా ఈ మర మనుషు లను వాడుతున్నారు.

"ఒకే ఒక మతం - మంచిగా బ్రతకడం!" - —థామస్ ఫుల్లర్

# పోటీ

ఫిబ్రవరి 1983

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకి తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీద అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలలో లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపను' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపనుతో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: ఫిబ్రవరి 20, 1983. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు తెలుగు "విస్‌డమ్", 9 దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## స్వయంగా నిర్మించుకునే జైళ్లు



"వయోజనులలో వేరు వేరు వర్గాలుగా విడిపోతూ ఉండే చిత్రమైన అలవాటు కనిపిస్తుంది. మతం, కులం, రంగు, భాష, ఆచారం, ఐశ్వర్యం, దారిద్ర్యం - అన్నిటితో మనుష్యులు తమ మధ్య గోడలు నిర్మించుకుంటున్నారు. అలా స్వయంగా ఏర్పరచుకున్న జైళ్ళలో వారు బ్రతుకుతున్నారు.

-జవహర్‌లాల్ నెహ్రూ.

# న్యాసం

'ఇండియాలో జాతీయ సమైక్యం సాధిం

" 'స్వేచ్ఛ' అనే పునాదిమీద నిర్మించుకున్న మన ఘనత భౌతికమైంది కాదు; నైతికమైంది." —వూడ్రో విల్సన్

చడం ఎలా?' అనే అంశం మీద 300 మాటలు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. 1980 ఒలింపిక్ క్రీడలు ఏ నగరంలో జరిగాయి? 2 నాలుగుకాళ్ల జంతువులలో మిక్కిలి ఎత్తైంది ఏది? 3. ఇండియా ప్రధాన న్యాయమూర్తి ఎన్నో ఏట రిటైర్ అవుతాడు? 4. అమెరికా, ఇంగ్లండు, రష్యా, ఫ్రాన్స్ - ఈ దేశాలలో రాజరికం అమలులో ఉన్న దేశం ఏది? 5. సూర్యకాంతి నుంచి లభించే వైటమిన్ ఏది? 6. 'డీగో గ్రేషియా' దీవి ఎక్కడ ఉంది? 7. నెమలి, పావురం, కోకిల, కాకి - వీటిలో శాంతికి చిహ్నం ఏది? 8. వాత్స్యాయనుడు వ్రాసిన శాస్త్రం ఏది? 9. ఆంధ్రప్రదేశ్, అస్సాం, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ - వీటిలో సముద్రతీరం లేని రాష్ట్రం ఏది? 10. స్టోరేజి బ్యాటరీలో వాడే లోహం ఏది?

## పజిల్

ఆధారాలు : అడ్డం: 1. వ్రాత ప్రారంభించే ముందు పుటకు పైన వ్రాసే మాట, 4. తెలుగు రాజకీయాకాశంలో కొత్తగా ఉదయించిన 'నక్షత్రం', 6. ఓటమికి వ్యతిరేకం, 8. ఒక పండు, 9. ఐక్యరాజ్య సమితిని, 10. తరగవలెను, 12. తల్లక్రిందుల భజన, 13. ఒకసారి వింటే ఒప్పచెప్పే వాణ్ణి '——' గ్రాహి అంటారు, 14. వేదము - వ్యావహారికంలో, 16. ఆంధ్ర ఎన్నికలలో 'కాంగ్రెస్-ఐ'కి సింహస్వప్నం, 18 '—చీకటిలో సరిగ్గా కనిపించదు, 20. పిల్లికి—, ఎలక్కి ప్రాణ సంకటం, 21. ఆంధ్రదేశంలో జనవరి 5 దాకా సంరంభం కలిగించిన సంఘటన, 22. మొదలు లేని గాయము, 23. 'నూకలు'-

---

## టిబెట్‌లో దలైలామా ప్రాసాదం



Potala Palace
in Lhasa, Tibet

ప్రస్తుతం ఇండియాలో తల దాచుకుంటున్న దలైలామాకు టిబెట్‌లోని లాసా నగరంలో ఉన్న ప్రాసాదం అద్భుత శిల్ప సంపదకు నిలయం. పెద్ద పెద్ద బండ రాళ్ళతో 300 ఏళ్ళ క్రితం 5 వ దలైలామా చేత నిర్మించబడిన ఆ బృహత్ ప్రాసాదం పై అంతస్తు మీద 7 దేవళాలు ఉన్నాయి. వాటి ముందు బౌద్ధ భిక్షువులు ప్రార్థనలు చేస్తారు. ఆ దేవళాలలో మిక్కిలి పెద్దది 13 వ దలైలామాది. ఆ దేవళం గోడలకు తాపటం చేసిన బంగారపు రేకుకి సుమారు ఒక టన్ను బంగారం పట్టింది.

"కాముకునకు సిగ్గూ, దురాశాపరునికి ధైర్యం,
కోపిష్టివానికి ఆరోగ్యం సున్న!"

ఇంటిపేరైతే? 24. హద్దును. 25. అంట్ల గిన్నెలు పడేస్తే పని మనిషి చేసే పని.



నిలువు: 2. నన్నయ్యగారిచేత భారతం వ్రాయించిన నరేంద్రుడు, 3. దుర్యోధన పరాభవానికి కారణమైన సభ, 4. పద్మం, 5. 'కదలు', అనే క్రియకు క్త్వార్థక రూపం, 7. మౌనవ్రతం పట్టిన ఋషి, 8. జ్యోతిష్కుడు వ్రాసేది, 9. 'అయినచో' కుదించగలరా? 11. హాలుడు కూర్చిన - సప్తశతి, 13. ఏ చోటు? 14. యుద్ధము. 15. నరుల నుంచి వానరులను వేరుచేసేవి, 16. 'అరిపిరాల' చివర చూడండి, 17. మా యొక్క గాయకురాలు, 18. వస్తువు విలువను దేనిని బట్టి నిర్ణయిస్తాం? 19. సమస్తము, 20. మైత్రి, 21. 'ఎన్నికల నూతులు'- సంక్షిప్తనామం.

## తెలివికి పరీక్ష

1. గాయకుడు, శ్రుతి, శ్రోత, ఫిడేలు - సంగీతంలో విధిగా ఉండి తీర వలసిన అంగం ఏది? 2. 538 (27) 317, 638 ( ) 531 - బ్రాకెట్లలో సంఖ్య పూరించండి. 3. మగడు, భర్త, పతి, నాథుడు- వీటికి మరొక పర్యాయపదం సూచించండి. 4. 1112, 2223, 3334, 4445, 5556 - ఈ వరుసలో తరువాతి సంఖ్య ఏది? 5. గద్యం, మద్యం, పద్యం, కావ్యం - ఈ వర్గంలో అతకని మాట ఏది? 6. సా — —, — — కుదు - ఒకే (రెండక్షరాల) పదం వేసి రెండు మాటలూ అర్థవంతం చెయ్యండి.

## 'కుతూహలం' కోల్పోకూడదు!



"ప్రశ్నలు అడగడం మానెయ్యకూడదు - అది చాలా ముఖ్యం! కుతూహలానికి దాని అవసరం దాని కుంది. అనంతమైన సృష్టి, జీవితం, వాస్తవికత తాలూకు అద్భుత రచన- వీటిని మనన చేసిన కొద్దీ మనిషి సంభ్రమాశ్చర్యాలలో మునిగి పోక తప్పదు. ఈ అద్భుత జగత్తులో రోజూ ఏ కొంచెం అర్థం చేసుకోడానికి ప్రయత్నించినా చాలు! పవిత్రమైన 'కుతూహలాన్ని' మాత్రం ఎన్నడూ కోల్పోరాదు!" —ఐన్‌స్టైన్.

"ప్రేమలో పడితే ప్రతివాడూ కవే!" —ప్లేటో

7. గజిబిజి అయిన ఈ క్రింది నగరాలలో విదేశీ నగరాన్ని గుర్తించండి: త్తాకకల, గ్రామను, రైమదు,కియోటో, యిబాబొం,
8. సాక్షి వ్యాసాలు వ్రాసింది ఎవరు?
9. విరసం నడిపే పత్రిక ఏది?
10. 'దిక్సూచి' శీర్షిక ఏ పత్రికలో వస్తుంది? ఆ శీర్షిక నిర్వహించేది ఎవరు?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. మరీచిక: (ఏ) ఎండమావి, (బి) మారీచుని కూతురు, (సి) మరపు, (డి) మృగతృష్ణ.
2. బిభీషిక: (ఏ) విభీషణుని భార్య, (బి) భయం, (సి) బెదరింపు, (డి) తిట్టు.
3. సూచిక: (ఏ) వ్యూహం, (బి) ఒక పక్షి, (సి) సూది, (డి) పట్టిక.
4. పాచిక: (ఏ పిచ్చుక, (బి) వంట లక్క, (సి) పాసిపోయిన అన్నం, (డి) జూదంలో వాడే గుంటల కడ్డీ.
5. వీచిక: (ఏ) వాచకం, (బి) పిచ్చుక, (సి) కెరటం, (డి) తరంగం.
6. కచ్చిక: (ఏ) కచ్చితం, (బి) కాలిన పిడక, (సి) కక్ష, (డి) ఇచ్చకం.
7. లాపిక: (ఏ) విలాపిని, (బి) నర్తకి, (సి) మోహిని, (డి) వాహిని.
8. బదరిక: (ఏ) రేగిచెట్టు, (బి) ఒక సినీ నటి, (సి) ఒక పత్రిక, (డి) ఒక ఆశ్రమం.
9. శారిక: (ఏ) గుడ్లగూబ, (బి) గోరింక, (సి) కాకి, (డి) కోకిల.
10. పాలిక: (ఏ) స్తనం, (బి) భాగస్వామి, (సి) మూకుడు, (డి) పాలకురాలు.

---

## పూర్తిగా విద్యుచ్ఛక్తితో నడిచే కారు!



ఇద్దరు కూర్చునేందుకు వీలైన 'పోల్‌మన్ ఎల్' అనే కారు పూర్తిగా విద్యుచ్ఛక్తితోనే నడుస్తుంది. సింథెటిక్ పదార్థంతో తయారయ్యే బ్యాటరీ దాన్ని నడుపుతుంది. మనం ఇంట్లో వాడే కరెంటుతో దాన్ని తిరిగి తిరిగి చార్జ్ చేసుకుంటూ ఉండవచ్చు ప్రయాణం మధ్యలో బ్యాటరీ పాడైతే పని చేసేందుకు ఒక చిన్న పెట్రోల్ ఇంజన్‌కూడా ఉంటుంది. గంటకు 100 కి.మీ.ల వేగంతో ఈ కారు ప్రయాణించ గలదు. 1985 లో ఈ విద్యుచ్ఛక్తి కారు ప. జర్మనీలో మార్కెట్‌లోకి వసుంది.

"తీవ్రంగా ఆకర్షించే ఏ వస్తువైనా దానిపట్ల అంత తీవ్రమైన వైముఖ్యాన్నీ కలిగిస్తుంది!" —ఎర్నెస్ట్ హెమింగ్వే

## అదృష్ట పాఠకుడు

పోస్టుకార్డు సైజులో మీ ఫొటోతో సహా సంగ్రహంగా మీ 'పరిచయం' వ్రాసి పంపండి. చీట్లు తీసి నిర్ణయించే అదృష్ట పాఠకుని/పాఠకురాలి ఫొటో, పరిచయం 'విస్‌డమ్'లో ప్రచురిస్తాం. రు. 10 లు ఖరీదు చేసే ఒక పుస్తకం కూడా ఆ అదృష్ట పాఠకుడికి లేదా పాఠకురాలికి పంపుతాం. ఫొటో వెనుక విధిగా అడ్రస్సు వ్రాయాలి. ఫొటోలు త్రిప్పి పంపబడవు.

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి, రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు బహుమతి.

## మీ ప్రశ్నలు

వ్యక్తిగతమైనవి కాకుండా అందరికీ ఆసక్తి కలిగించే ప్రశ్నలు అడగండి.

ప్రముఖ సినీ నటి, కథా రచయిత్రి
**శ్రీమతి పి. భానుమతీ రామకృష్ణ**
జవాబు లిస్తారు.

## విస్‌డమ్
పోటీల కూపను
ఫిబ్రవరి 1983

## శిశు మరణాల నివారణ



ప్రపంచంలో నిరుపేద పిల్లలలో ఒక్కొక్కడి క్రింద 100 డాలర్లు (సుమారు రూ. 900 లు) ఖర్చుపెట్టి ఉంటే, 1981 లో 1.7 కోట్ల శిశు మరణాలను నివారించడానికి వీలై ఉండేది. 1982 లో పుట్టిన పిల్లలలో కూడా ఏడాది నిండేలోగా 1.2 కోట్ల మందీ, 5 ఏళ్లు వచ్చేలోగా 50 లక్షల మందీ శిశువులు మరణించడం జరుగవచ్చు. ప్రపంచం చేస్తున్న సైనిక వ్యయంలో 6 వారాల ఖర్చు పెడితే ఈ శిశు మరణాలు నివారించవచ్చు.

'యునైటెడ్ నేషన్స్ చిల్డ్రన్స్ ఎమర్జెన్సీ ఫండ్' వారి నివేదిక నుంచి

"ఎరువు సొమ్ము లాగా ఎరువు భావాలు కూడా వ్యక్తి దారిద్ర్యాన్ని చాటుతాయి!" —లేడీ బ్లెసింగ్టన్

## మీరైతే.....?

"రాష్ట్ర విద్యా మంత్రి అయితే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ



8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షిక సూచించండి. ●

## చేసిన రెండవ మహిళ



ప్రపంచంలో అంతరిక్షంలో పరిభ్రమించిన రెండవ మహిళ స్వెట్లానా సవిట్స్కాయా. తోటి అంతరిక్ష యాత్రికులతో సహా అగస్టు 27 న మధ్య ఆసియాలో ఆమె భూమి మీదికి తిరిగి వచ్చింది. 'సోయుజ్ - టి 7'లో శాస్త్రీయ పరిశోధనలు కొనసాగించిన అంతరిక్ష యాత్రికురాలు ఆమె. వైమానిక క్రీడలలో ప్రపంచ రికార్డు స్థాపించిన సవిట్స్కాయాకు 'సోవియట్ వీరనారి' (Heroine of the Soviet Union) అనే 'ఆర్డర్ ఆఫ్ లెనిన్', 'గోల్డ్ స్టార్ మెడల్‌'నీ ఇచ్చి రష్యా ప్రభుత్వం సత్కరించింది.

"ఆలోచించే వారికి స్వర్గం,
అనుభవించేవారికి నరకం - ఈ ప్రపంచం!" —హొరేస్ వాల్పోల్

(16 వ పేజీ తరువాయి)

"హేతువాద సంఘం'పై మీ అభిప్రాయం ఏమిటి?"

• 'ఎవరి పిచ్చి వారి కానందం!' అని.

* * *

పి. తారక రామారావు, కంచర పాలెం, విశాఖపట్నం - 8.

"సాయిబాబా ద్రోహి అని డా. కోవూర్ ప్రకటించారు - మరి మీ అభిప్రాయం?"

• షిరిడీ సాయిబాబా భక్తురాలిని నేను. సత్య సాయిబాబాను గురించి నాకు తెలియదు. కాబట్టి ఆయన ద్రోహి అవునో, కాదో ఆ షిరిడీ సాయిబాబాకే తెలియాలి! నా మట్టుకు నేను "ఎందరో మహానుభావులు వారందరికీ వందనాలు!" అంటాను.

* * *

బూర్లె నరసింహమూర్తి, ఖరగ్‌పూరు

"బ్రిటిష్ పాలన మన స్వరాజ్య పరిపాలన కన్న బాగుండేది అనిపిస్తుంది - మీరే మంటారు?"

• అబ్బ! ఈ మాట మా నాన్నగారు బ్రతికుండగా పదే పదే అంటూ ఉండే వారయ్యా! మళ్ళీ ఈ నాడు నీ నోట విన్నాను. నా ప్రాణం లేచి వచ్చింది!

* * *

గోన శివరామకృష్ణా రెడ్డి, కాని దేడు (కర్నూలు జిల్లా).

"స్త్రీల చేతిలో కీలుబొమ్మ అయ్యే మగాళ్ళని చూస్తే ఏమనిపిస్తుంది?"

• వెన్నెముక లేని మగాళ్ళనిపిస్తుంది. లేకపోతే 'ఇండివిడ్యువాలిటీ' లేని చవటలనిపిస్తుంది.

* * *

జె. సుబ్బమ్మ, ముచ్చివోలు (చిత్తూరు జిల్లా).

"రికార్డు డ్యాన్సులంటే పరిగెత్తుకు వచ్చే నిరక్షరాస్యులైన వయోజనులు రాత్రి బడికి రా రెందుకని?"

---

## మిక్కిలి దూరంలో కాంతివంతమైన ఖగోళాలు



ఆస్ట్రేలియన్, బ్రిటిష్ ఖగోళ శాస్త్రజ్ఞుల బృందం ఒకటి భూమి నుంచి ఎక్కువ దూరంగానూ, మిక్కిలి ప్రకాశవంతంగానూ ఉన్న 'క్వాజార్'లు అనబడే నూతన ఖగోళాలను గుర్తించారు. భూమి నుంచి 2,000 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న 'క్వాజార్' నుంచి కోటి కోట్ల సూర్యుల శక్తి ప్రసారం అవుతూంది.

"200 రకాల దృక్పథాలు ఉన్న దేశంలో 'ఏకపక్ష విధానం' ఎలా సాధ్యం?" —ఛార్లెస్ డీ గాల్

• రెక్కాడితే గాని డొక్కాడని కష్ట జీవులకు కాసేపైనా కనువిందు కలిగించే కాలక్షేపం అవసరం కనుక. రాత్రి బడిలో కూచుని పగలు శరీరానికీ, రాత్రి బుర్రకూ పని చెప్పడం వాళ్ళకు ఇష్టం లేదేమో!

* * *

పి. కాంశెట్టి, కామారెడ్డి

"ఇందిరమ్మ గొప్పదా? మన దేవతలు గొప్పవారా?"

• ప్రస్తుతం కనిపించే దేవత ఇందిరమ్మే గొప్పది. కనిపించని దేవతల సంగతి నీ కెందుకయ్యా!

* * *

సాహిని కాంతారావు,
శృంగవరపుకోట.

"ఈ దేశానికి మీరు ప్రధాన మంత్రి అయితే?"

• ఒకప్పుడయితే సమాధానం చెప్పే దాన్ని! ప్రస్తుతం మన దేశం ఉన్న పరిస్థితిలో మనకు ప్రధాన మంత్రిగా ఉండడానికి అన్ని విధాలా ఇందిరమ్మే అర్హురాలంటాను.

* * *

ఎస్. విశ్వనాథం, చినబాడాం

"నిరుద్యోగ సమస్య నిర్మూలించాలంటే ఏం చేయాలి?

• ఒళ్ళు వంచి పని చేయాలి! స్వయం కృషి మీద ఉపాధి కల్పించుకోవాలి - ఇతరుల మీద ఆధారపడకుండా!

బి. వి. ఎస్. మూర్తి, బలిజేపల్లి (తూ.గో.జిల్లా)

"మీ అభిమానులకు మీ రిచ్చే సందేశం ఏమిటి?

• 'విస్డమ్' చదివి విజ్ఞానం పెంపొందించుకొని అందరికీ పంచిపెట్టండి! - అని.

* * *

వి. శివప్రసాద్ వర్మ, సికింద్రాబాద్.

"శ్రీమతి ఇందిరా గాంధీ తరువాత మన దేశానికి ప్రధాని ఎవరు?"

• అదే నా చింత కూడా!

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద గ్రంథం



754 సంపుటాలూ, సుమారు 2½ టన్నుల బరువూ ఉన్న మిక్కిలి పెద్ద గ్రంథం ఒకటి ఇటీవల ఇంగ్లండులో ప్రకటించబడింది. ముద్రణకు 15 ఏళ్ళ కాలం పట్టిన ఈ బృహత్ గ్రంథంలో 5,27,000 పుటలూ, 1,13,40,000 ఎంట్రీలూ ఉన్నాయి. ఒక్కొక్క ప్రతి వెల: 16,523 పౌన్లు (సుమారు రూ. 3,40,000 లు).

"ఆదాయం కంటె ఖర్చు ఎక్కువ పెట్టేవాడు దరిద్రుడు!" —లాబ్రూయెరె

# ప్రపంచ వార్తలు

## నాడి చూసి చెప్పే మీటరు:

మ్యూనిచ్ (ప. జర్మనీ) లోని 'నావెల్' అనే సంస్థ తయారు చేసిన నాడీ స్పందనాలను లెక్కించి చెప్పే మీటరు సాయంతో ఇప్పుడు గుండె జబ్బులతో బాధపడే రోగులు తమ నాడీ స్పందనాల సంఖ్య డాక్టరు చెప్పిన స్థాయిలో ఉందీ, లేనిదీ తేలికగా తెలుసుకోవచ్చు.

* * *

## బంగ్లాదేశ్ జనాభా పెరుగుదల:

ప్రపంచంలో జనాభా సంఖ్య దృష్ట్యా బంగ్లాదేశ్ ఇప్పుడు 8వ స్థానంలో ఉంది. ప్రస్తుతం 9 కోట్ల జనాభా గల ఆ దేశంలో రోజుకి 10,000 శిశువులు కొత్తగా పుడుతున్నారు. వ్యావసాయికోత్పత్తిలో ఆశ్చర్యకరమైన అభివృద్ధి సాధించినా, ఇప్పటికీ ఆహార ధాన్యాలను చాలా ఎక్కువగా దిగుమతి చేసుకునే దేశాలలో బంగ్లాదేశ్ ఒకటి.

* * *

## ఉత్తరార్ధ గోళం మీద వింత పొర:

లేసర్, రాడార్ పరికరాల సాయంతో జపాన్‌లోని క్యుషూ విశ్వవిద్యాలయం శాస్త్రవేత్త ప్రొ. మొటూకాజు హిరోనో భూమి ఉత్తరార్ధ గోళం మీదుగా మిక్కిలి సూక్ష్మమైన అణువుల (particles) తో కూడిన ఒక పొర కదులుతూ ఉండడం గుర్తించారు. స్థూల దృష్టికి గోచరించని ఈ అణువులు 1980 లో అమెరికాలోని సెయింట్ హెలెన్స్ అగ్నిపర్వతం వాతావరణంలోకి ఎగజిమ్మిన అణువులను పోలి ఉన్నాయి.

## ఆసియాలో వయోవృద్ధుల పెరుగుదల



క్రీ.శ. 2,000 సం.రం నాటికి ప్రపంచంలో 60 ఏళ్ళ పైబడిన వయోవృద్ధులు 58 కోట్లు ఉండగల రనీ, వారిలో ఇంచుమించు సగం మంది (2.8 కోట్లు) ఆసియాలోనే ఉంటా రనీ భావిస్తున్నారు. మొత్తం జనాభా 52 శాతం చొప్పున పెరుగుతూ ఉండగా వయోవృద్ధుల సంఖ్య అతి శీఘ్రంగా 102 శాతం చొప్పున పెరుగుతూంది.

"ఎలాంటి పరిస్థితులలోనూ తన స్వభావంలో మార్పు రాని వాడే నిజంగా గొప్పవాడు!"

## రికార్డు ధరకు అమ్ముడైన చేప:

దక్షిణ హక్కైయాడో (జపాన్) తీర సముద్రంలో పట్టుబడిన 239 కి.గ్రా.ల బరువున్న నీలి రెక్కలు గల ఒక 'ట్యూనా' చేప టోకియోలోని సుప్రసిద్ధమైన చేపల మార్కెట్టు 'ట్సుకిజి'లో వేలం పాడగా 35,85,000 యెన్‌లకు (16,730 డాలర్లకు) అమ్ముడు పోయింది.

* * *

## శుక్రగ్రహం మీది నేల రంగు:

రష్యా పంపిన 'వీనస్-13' అనే అంతరిక్ష నౌక శుక్ర గ్రహం మీద దిగి ముదురు గోధుమ (dark brown) రంగులో ఉన్న అక్కడి నేల తాలూకు అద్భుతమైన వర్ణ చిత్రాలను భూమి మీదికి ప్రసారం చేసింది. దిగిన తరువాత 2 గంటల సేపట్లో అక్కడి వేడికి అది కాలిపోయే ముందు ఈ చిత్రాలను అది ప్రసారం చేసింది. శుక్ర గ్రహం చుట్టూ అతి వేగంగా పరిభ్రమించే పసుపు పచ్చని మేఘాలు ఆవరించి ఉండడం వల్ల కక్ష్యలో తిరుగుతూ ఆ గ్రహాన్ని ఫొటోలు తియ్యడం సాధ్యపడ లేదు.

## చురుకైన చూపు గల గూఢచారి ఉపగ్రహం:

అమెరికావారు భూమి కక్ష్యలోకి పంపిన 'టిటాన్ III-సి' అనే ఒక గూఢచారి ఉపగ్రహం 32,000 కి.మీ.ల దూరం నుంచి భూమి మీద ఉన్న గోల్ఫ్ బంతి అంత చిన్న వస్తువును కూడా స్పష్టంగా గుర్తించ గలదు.

* * *

## 'ప్లూటో'కు ఆవల మరొక గ్రహం:

లెనిన్‌గ్రాడ్‌లోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ థియరెటికల్ ఆస్ట్రోనమీ' డైరెక్టరు 'గ్లెబ్ చెబటారోవ్' ప్లూటో గ్రహానికి వెలుపల సూర్యుని చుట్టూ తిరుగుతున్న మరో గ్రహం ఉండా లని కనుగొన్నారు. 19 వ శతాబ్దిలో కనిపించిన తోకచుక్కలను గణిత శాస్త్ర రీత్యా పరిశీలించగా అలాంటి గ్రహం ఉనికి నిర్ధారణ అయిందట. ఆ గ్రహం ఇంచు మించు భూమి సైజులో ఉంటూ సూర్యుడి నుంచి భూమి కంటె 54 రెట్లు ఎక్కువ దూరంలో సూర్యుణ్ణి చుట్టి వస్తుంది.

## దుర్గంధ నివారిణి



జపాన్‌లో ఇటీవల తక్కువ వెలకు లభించే 'దుర్గంధ నివారిణి' అనే ఒక పరికరం తయారుచేశారు. ముఖ్యంగా రోగుల మంచం క్రింద దీనిని పెడితే క్షణంలో ఆ గదిలోని దుర్గంధాన్ని ఇది హరించివేస్తుంది. దీనిలో ఉన్న ఒక ఫాన్ గాలిలోని దుర్గంధాలను ఆకర్షించి కొన్ని ఖనిజాల సాయంతో వాటి కంపును తొలగించి వేస్తుంది.

('ఇన్వెన్షన్ ఇంటిలిజెన్స్' సౌజన్యంతో)

"దుష్టులంత గట్టిగా మంచివారు మాట్లాడే దేశంలో సుఖ శాంతులకు లోటుండదు."

# ద్రోణుని పరాభవం

స్వామి జ్యోతిర్మయానంద

కౌరవులకూ, పాండవులకూ ధనుర్విద్యా గురువు ద్రోణుడు. భారత యుద్ధంలో పోరాడిన మహావీరులలో ఆయన ఒకరు.



ధనుర్విద్యలో ఆయనకు ఆయనే సాటి. యుద్ధంలో మానవ మాత్రు డెవడూ ఆయనను జయించలేడు. అదీ గాక, ఆయన కుమారుడు అశ్వత్థామ చిరంజీవి; అంటే అతనికి మరణం లే దన్నమాట. తన కుమారుడు మరణించా డనే మాట వింటే తప్ప తనకు మరణం రాకుండా ద్రోణునకు వరం ఉంది. అందుచేత - ఏ విధంగా చూసినా ద్రోణాచార్యుడు మరణించడానికి అవకాశం కనిపించదు. చిరంజీవి అయిన ఆయన కుమారుడు చనిపోయా డనే నమ్మకం ఆయనకు ఎవరు కలిగించగలరు?

అశ్వత్థామను వధించడం అసంభవ మని అర్జునునికి తెలుసు. అందుచేత తను ద్రోణుణ్ణి గెలవడం కలలో మాట అని అతడు భావించాడు. నరుల ఆలోచనలు ఇలాగే ఉంటాయి. తమ ధీశక్తి అంతా ఉపయోగించి రెండూ, రెండూ కలిపితే ఎంత వస్తుందీ అని వారు లెక్కిస్తారు. ఎన్నిసార్లు చూసినా వారికి నాలుగే వస్తుంది. అయితే—ఆ ప్రశ్నకు ఇతర సమాధానాలు కూడా ఉన్నాయి. దేవుడి గణిత శాస్త్రం ఎవ్వరికీ అంతుపట్టనిది. ఆ గణితంలో ఒక్కొక్కప్పుడు రెండూ, రెండూ కలిపితే రెండే కావచ్చు; మరొకప్పుడు అది 2 వేలు కావచ్చు, లేదా 2 లక్షలు కావచ్చు. దేవుడి రాజ్యంలో దేనికీ పరిమితులు అంటూ లేవు. అందుచేత కృష్ణ భగవానుడు ద్రోణుని మరణానికి పథకం తయారుచేశాడు.

లోలోపల ద్రోణాచార్యుడు పాండవ పక్షపాతే! అయినా, ధర్మానికి కట్టుబడి దుర్మార్గులయిన కౌరవుల పక్షాన పాండవులతో

---

## "అన్నీ భలే బాగున్నాయి!"

ఒకరోజు సుధ ఇంటికి వస్తూనే కొత్తగా కుదుర్చుకున్న పనిమనిషిని అడిగింది: "ఏమే నేను చెప్పినట్టు 'రెఫ్రిజిరేటరు' 'క్లీన్' చేశావా?"

"చేశానం డమ్మగారూ! అన్నీ భలే బాగున్నాయండీ!"

---

"పరులలో పెద్దవిగా, సమర్థించరానివిగా కనిపించే దోషాలే మనలో అసలు కనిపించవు!" — లా బ్రూయెర్

ఆయన యుద్ధం చెయ్యడం తప్పనిసరి అయింది. గురువైన ద్రోణునికి తన శిష్యులలో అర్జునుడంటే ఎక్కువ ప్రీతి. అర్జునుడు ఎప్పుడూ గురువుగారికి బాణాలతోనే అభివందనం చేసేవాడు. ఆ బాణాలు ద్రోణునికి ఎంతో ఆనందాన్ని కలిగించేవి. అదొక చిత్రమైన ఆనందం! ఒక పహిల్వాన్ తన శిష్యుని చేతిలో చిత్తయినప్పుడు పొందే ఆనందం లాంటిది అది. అర్జునుడు ఏ అస్త్రం ప్రయోగించినా, అంత ఖచ్చితంగా ప్రయోగించి, తను నేర్పిన విద్యకు రాణింపు తెస్తున్నందుకు ద్రోణుడు మురిసిపోయేవాడు. అయితే - ధర్మానికి తల ఒగ్గి తన సర్వశక్తులూ వినియోగించి పాండవులకు వ్యతిరేకంగా ఆయన యుద్ధం చేస్తున్నాడు.

ఆ రోజులలో భారత దేశంలో యుద్ధవీరులు కొన్ని ధర్మాలను పాటించేవారు. ప్రతికక్షి ఏ ఆయుధంతో తమను ఎదిరిస్తే ఆ ఆయుధంతోనే అతనితో వారు పోరాడేవారు. అతడు రథంమీద వస్తే తామూ రథం ఎక్కి, లేదా పాదచారిగా ఉంటే తామూ పాదచారిగానే యుద్ధం చేసేవారు. అస్త్ర సన్యాసం చేసి చేతులెత్తిన వారితో యుద్ధం చేసేవారు కారు. ఇలా ఎన్నో యుద్ధ ధర్మాలు వారు పాటించేవారు. ద్రోణుడు ఆ ధర్మాలు తెలియనివాడు కాదు. అయినా దుష్టులయిన కౌరవుల ప్రోద్బలం వల్ల పదాతిసేనల మీద మహాస్త్రాలను ప్రయోగించి, వేలాది మందిని ఆయన పొట్టను పెట్టుకున్నాడు.

అలా అధర్మానికి ఒడిగట్టిన వెంటనే కృష్ణపరమాత్మ ద్రోణాచార్యుణ్ణి అంతమొందించేందుకు పథకం తయారు చేశాడు. ఒక ఏనుగుకి 'అశ్వత్థామ' అని పేరు పెట్టాడు. భీముణ్ణి ఆ ఏనుగును వధించమన్నాడు. వధించి, "అశ్వత్థామ హతః కుంజరః! అశ్వత్థామ హతః కుంజరః!" అని అరవమన్నాడు. ద్రోణుని చెవిని ఆ మాట పడింది. వేలాది సైనికులను హతమారుస్తూ ఆయన

---

## 'వరం' అయిన చెవుడు



దాదాపు 1,300 కొత్త పరికరాలు సృష్టించి పేటెంట్లు తీసుకున్న అమెరికన్ ఇన్వెంటర్ థామస్ అల్వా ఎడిసన్ (1847-1931)కి ఘోరమైన చెవుడు ఉండేది. ఏ చప్పుళ్ళూ, ఎవరి విమర్శలూ చెవిని బడకుండా ఏకాగ్రంగా పనిచేసుకోడానికి అవకాశం కల్పించిన ఆ చెవుడుని ఆయన ఒక వరంగానే భావించారు. మామూలు మనిషి 4 గం.లలో గాని పొందలేని విశ్రాంతిని తను తన చెవుడువల్ల 15 ని. లలోనే పొందగలుగుతున్నానని ఆయన అనేవారు!

---

"నాకు ఆరుగురు నమ్మిన బంట్లు: 'ఎందుకు?', 'ఏది?', 'ఎప్పుడు?', 'ఎక్కడ?', 'ఎలా?', 'ఎవరు?'" —రుడ్యార్డ్ కిప్లింగ్

మనస్సు కలతపడి ఉండడంవల్ల ఆయనకు దిగ్భ్రాంతి కలిగింది. తన కుమారుడు అశ్వత్థామకు మరణం లేదని తెలిసి కూడా భీముడు



విజయగర్వంతో అలా బొబ్బలు పెడుతూ ఉండడం చూసి ఆయనకు అనుమానం కలిగింది. ధర్మరాజు సత్యసంధుడు అని ఆయనకు తెలుసు. అతని నోట వింటే గాని ఆ మాట తాను నమ్మదలుచుకోలేదు.

ద్రోణుడు యుద్ధం సాగిస్తూనే ఉన్నాడు. ద్రోణుని అనుమానం కృష్ణునికి తెలిసింది. కృష్ణుడు ధర్మారాజును 'అశ్వత్థామ హతు డయాడు!' అని ద్రోణునితో చెప్పమన్నాడు. ధర్మరాజు అసత్యం ఆడడానికి వెనుకాడుతూ ఉంటే "నిన్ను అబద్ధం చెప్పమని ఎవరన్నారయ్యా? భీముడు 'అశ్వత్థామ' అనే ఏనుగును వధించిన మాట నిజమే గదా! ఆ మాటే చెప్పు!" అన్నాడు. ధర్మరాజు "అశ్వత్థామ హతు డయాడు - అశ్వత్థామ అనే ఏనుగు!" అన్నాడు. ఆ రెండో మాట ద్రోణునికి వినిపించకుండా శ్రీకృష్ణుడు సరిగ్గా ఆ సమయానికి గట్టిగా తన శంఖం పూరించాడు. ధర్మరాజు నోట "అశ్వత్థామ హతు డయాడు" అనే మాట వెలువడగానే ద్రోణుని నవ నాడులూ క్రుంగిపోయాయి. పాండవులు సులువుగా ఆయనను వధించారు.

ఆ విధంగా-ఎవ్వరికీ జయించరాని ద్రోణాచార్యు డంతటివాడు కూడా భగవంతుని పథకంలో అజేయుడుగా నిలువలేక పోయాడు!

## ధ్యానం లేకపోతే హృదయం ఎడారి అవుతుంది




"ధ్యానం ఎంతో ముఖ్యమైంది ధ్యానానికి చివర లేదు; మొదలు లేదు. అదొక వాన చినుకు లాంటిది. ఆ చిన్న చినుకులోనే నదులూ, సముద్రాలూ, జలపాతాలూ ఉన్నాయి. అదే భూమికీ, మానవ జాతికీ జీవనాన్ని ఇస్తుంది. అది లేకపోతే భూమి ఎడారి అవుతుంది. ధ్యానం లేకపోతే హృదయం ఎడారి అయిపోతుంది."

—జె. కృష్ణమూర్తి

"నిన్ను పొగుడుకోకు - ఎవరూ నమ్మరు;
నిన్ను కించపరచుకోకు - అదే నిజం అనుకుంటారు!" —జోసెఫ్ రౌక్స్

(8 వ పేజీ తరువాయి)

జరుపుకునే పండుగలలో ఒకటి అయిన దసరా మైసూరులో మహా వైభవంగా జరుగుతుంది. ప్రతి ఏడూ ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమి దాకా జరిగే ఈ ఉత్సవాలను స్థానికంగా "దేవీ నవరాత్రులు" అని కూడా అంటారు. ఆ పదిరోజులూ వింత వింత రంగులతో, కాంతులతో మైసూరు నగరం కన్నుల పండువుగా ఉంటుంది. దేశం నలుమూలల నుంచీ ఉత్సవాలు చూడడానికి జనం విరుగబడతారు. ఎక్కడ చూసినా ఇసుక వేస్తే రాలనంత మంది జనం. ప్రతి ఇంటికీ తిరునాళ్ళ కళ వస్తుంది. స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ నూతన వస్త్రాలు ధరించి తమ తమ ఇష్ట దేవతలను ఆరాధిస్తారు.

మైసూరుకు 19 కి.మీ.ల దూరంలో ఉన్న 'కృష్ణరాజ సాగర్' దక్షిణ భారతదేశం అంతటికీ మిక్కిలి పెద్ద రిజర్వాయరు. వెనుకటి మైసూరు మహారాజా పేరిట 1923 లో ఇది నిర్మించబడింది. కావేరీ నదికి అడ్డంగా నిర్మించిన ఈ ఆనకట్ట ఎత్తు 40 మీ.లు: పొడవు 3 కి మీ.లు; లోతు 124 అ.లు. 50 చ.మైళ్ళ ప్రాంతంలో విస్తరిల్లి ఉన్న ఈ రిజర్వాయరువల్ల కర్ణాటక రాష్ట్రంలోని 1,20,000 ఎకరాల మెరక ప్రాంతాలు కొత్తగా సాగులోకి వచ్చాయి. సుప్రసిద్ధ ఇండియన్ ఇంజినీరు శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్యా నిర్మించిన డామ్ ఇది.

డామ్ ప్రక్కన అందమైన 'బృందావన్ గార్డెన్స్'కు కూడా శ్రీ విశ్వేశ్వరయ్యే పథకం సమకూర్చారు. నది రెండు గట్లమీదా అంతస్తులుగా వ్యాపించి ఉన్న ఈ ఉద్యానవనం పచ్చని పచ్చిక పట్టులతో, రంగురంగుల పూల మొక్కలతో, అందమైన విహార మార్గాలతో, మధ్య మధ్య మనోహరమైన ఫౌంటెన్‌లతో, రాత్రిపూట రంగు రంగుల సెర్చిలైట్లలో మరింతగా కన్నులు చెదరగొడుతూ భూలోక నందనవనంగా ప్రసిద్ధి పొందింది: టూరిస్టులను విశేషంగా ఆకర్షిస్తూంది. ●

## మిక్కిలి ఎత్తు ఎదిగే తెగల వారు



బెల్జియం కాంగోలోని 'టుట్సీ' వారూ, చిలీలోని ఓనా జాతివారూ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన వారు. ఆ తెగలలో పురుషుల సరాసరి ఎత్తు 5 అ. ల 11 అం.లు. యూరప్‌లోని మాంటి నేగ్రిన్‌లూ (ఎత్తు: 5 అ. ల 10 అం. లు), గ్రేట్ బ్రిటన్‌లోని సదరన్ లాండ్ షైర్‌లో నివసించే ఒక తెగ వారూ (ఎత్తు: 5 అ. ల 9½ అం. లు) ఆ తరువాత చెప్పుకోదగ్గవారు.

"బళ్ళో బోధించవలసిన ఒక ముఖ్య విషయం: కలుపుగోలు తనం." —విల్‌ఫ్రెడ్ ఫంక్

# పోటీల (ఫలితాలు)

(డిసెంబరు 1982)

వ్యాసం: మొదటి బహుమతి: ఆర్. జయకుమార్. చిత్తూరు; రెండవ బహుమతి: ప్రతాప్ కిష్టయ్య. లింగన్నపేట (కరీంనగర్ జిల్లా); మూడవ బహుమతి: పి.ఆర్. మందేశ్వర రావు, రాజమండ్రి.

క్విజ్: జవాబులు: 1. అది ఒక చరిత్రాత్మకమైన యుద్ధం జరిగిన చోటు, 2. దయానంద సరస్వతి, 3. బి.ఆర్. అంబేద్కర్, 4. భారత రాష్ట్రపతి, 5. లాల్‌బహదూర్ శాస్త్రి, 6. లార్డ్ మౌంట్ బాటన్, 7. కోయవారు, 8. జపాన్, 9. జయవర్ధనె, 10. స్వీడెన్.

విజేతలు: మొదటి బహుమతి: జి.ఎన్.ఎస్. నారాయణ, తాళ్ళూరు (ప్రకాశం జిల్లా); రెండవ బహుమతి: వి. పతంజలి శర్మ, రాయపూరు (మధ్యప్రదేశ్); మూడవ బహుమతి: ఎస్ ఎన్. కిషోర్, కదిరి (అనంతపురం జిల్లా).

పజిల్: జవాబులు: అడ్డం: 1. భాగవతము, 4. నన్నయ్య, 6. ప్పర, 7. పాలు, 8. మరగించితి, 9. 'గసేని' 11. తత, 12. పడతుక, 14. ఏమరచి, 16. మగ, 19. సుదతి, 20. చపల చిత్త, 21. దేహం, 22. దగ, 23. సుకవి, 24. తములపాకు.

నిలువు: 1. భానుమతి, 2. వప్పగింత, 3. తరచి తరచి, 4. యవనిక, 10. సేతువు, 12. పరమపదము, 13. కాషద,

## 50,000 ఆటం బాంబులు



నిరాయుధీకరణకు సంబంధించిన 'యునైటెడ్ నేషన్స్ సెంటర్' సెక్రటరీ జనరల్ అభ్యర్థనపై నిపుణ శాస్త్రవేత్తలు జరిపిన పరిశీలన వల్ల ప్రస్తుతం ప్రపంచంలో 50,000 ఆటం బాంబులు తయారై రెడీగా ఉన్నాయనీ, వాటి సంయుక్త విధ్వంసక శక్తి 1945 లో అమెరికా హిరోషిమా (జపాన్) మీద వేసిన బాంబుకంటె 10 లక్షల రెట్లు ఎక్కువ వనీ తేలింది.

"సలహా పిండిమంచు లాంటిది; ఎంత మృదువుగా ఉంటే అంత ఎక్కువ కాలం నిలిచి ఉంటుంది." —శామ్యూల్ టెయిలర్ కాలరిడ్జ్

14. ఏసుదాసు, 15. రతీదేవి, 17. గలగల, 18. అత్తలకు.

విజేతలు: మొదటి బహుమతి: ఎన్. ఎస్.జె. కె. లక్ష్మి, విశాఖపట్నం; రెండవ బహుమతి: టి. ప్రకాష్, కురుపాం; మూడవ బహుమతి: జె. శ్రీధర్, నెల్లూరు.

తెలివికి పరీక్ష: జవాబులు: 1. క్షేమం, క్షత్రియుడు, క్షీరం మొ॥; 2. పకోడి, 3. ఇల్లు (గృహం), 4. జబ్బు, రోగం. 5. 182 (తక్కినవి వాటి తరువాతి సంఖ్యలకంటె 13 మాత్రమే తక్కువ), 6. 'సి' విటమిన్, 7. రాగి, తుత్తునాగం, 8. నండూరి వెంకట సుబ్బారావు, 9. రవీంద్ర నాథ్ ఠాగూర్ వ్రాసిన 'గీతాంజలి' కి, 10. అమెరికాలోని హూస్టన్ నగరంలో.

విజేతలు: మొదటి బహుమతి: కె వి. ఎల్. నరసింహ శాస్త్రి, విజయవాడ; రెండవ బహుమతి: వి. రామకృష్ణ, శృంగవరపు కోట; మూడవ బహుమతి: కె. వెంకటే శ్వర్లు, షేర్ మహమ్మద్ పేట (కృష్ణా జిల్లా)

మాటల మహిమ: జవాబులు: 1. రైతు (సి), 2. ఒక సర్పము (బి), పరీక్షిత్తును కాటు వేసిన పాము (డి), 3. యుద్ధము (సి), 4. రక్తము (డి), 5. చెవుడు (బి), 6. క్రింది పెదవి (డి), 7. పర్వతము (సి), 8. తెలిసినది (డి), 9. గుమ్మడికాయ (సి), 10. సమూహము (డి)

విజేతలు: మొదటి బహుమతి: ఎమ్. రామమోహనాచార్యులు, రమణక్కపేట (కృష్ణా జిల్లా); రెండవ బహుమతి: శిష్టా నాగమణి, తుంగభద్ర డామ్; మూడవ బహుమతి: వి. శ్రీనివాసులు, సికింద్రాబాద్.

అదృష్ట పాఠకుడు: అంచూరి రాజేంద్ర ప్రసాద్, హైదరాబాద్.

ముఖచిత్ర వాఖ్య: రెండవ బహుమతి: ఇ. విశ్వనాథ ప్రసాద్, అనంతపురం; మూడవ బహుమతి: ఎమ్. అరుణ, కావలి (నెల్లూరు జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: ఎన్. లక్ష్మీనారాయణ చౌదరి, మాల్యవంతం (అనంతపూరు జిల్లా); రెండవ బహుమతి: కె వి.ఎల్. నరసింహ శాస్త్రి, విజయవాడ; మూడవ బహుమతి: వై. రాజా బాల సత్యమూర్తి, మామిడి కుదురు (తూ. గో. జిల్లా).

మీ ప్రశ్నలు: ఉత్తమ ప్రశ్న కె. వెంకటేశ్వరరావు, అత్తిలి (పశ్చిమ గోదావరి జిల్లా).

మీరైతే?: మొదటి బహుమతి: ఎన్. అనిల్ కుమార్, హైదరాబాద్; రెండవ బహుమతి: కోపూరి రవికుమార్, తెనాలి; మూడవ బహుమతి: సూరం మీనాక్షమ్మ, నెల్లూరు.

భావపరిచయ పోటీ: మొదటి బహుమతి: జి. బాలచంద్రయ్య, జడ్చర్ల (మెహబూబ్ నగర్ జిల్లా); రెండవ బహుమతి: ఇంద్రగంటి మధుసూదనరావు, నెల్లూరు; మూడవ బహుమతి: సూరెడ్డి ఆనంద చౌదరి, సాలూరు (విజయనగరం జిల్లా). ●

"ఎక్కువగా అవసర మైంది కాలం:
ఎక్కువగా దుర్వినియోగం చేసేదీ కాలాన్నే!" —విలియమ్ పెన్

